# సృజన



66 మార్చ్ 1975

పారిస్ కమ్యూన్
అమర స్మృతికి అంకితం

# సృజన

ఆధునిక సాహిత్య వేదిక

మాస పత్రిక

66

మార్చి 1975

పారిస్ కమ్యూన్ అమర స్మృతికి అంకితం

నిర్వహణ

'సాహితీ మిత్రులు'

150 పైసలు

SRJANA is commended for use in Public Libraries in the State by the Director of Public Libraries, Addhra Pradesh Hyderabad. Vide Ref. No. 182/A4/67, dated 22-9-1967.

Edited, Printed & Published by P. Hemalatha for 'Sahithee Mithralu'
Printed at Venkataramana Mudranalayam,
J.P.N. Road, Warangal-506002 (A.P.)

# చరిత్రలో మార్చి.....

మార్చి 18 ప్రపంచ కార్మికవర్గ చరిత్రలో మహత్తరమైన దినం. 1871 మార్చి 18న పారిస్‌నగర కార్మికులు అక్కడి బూర్జువా పాలకులతో పోరాడి ప్రభుత్వాధికారం తమ హస్తగతం చేసుకొని కమ్యూన్‌ను స్థాపించుకొన్నారు. ప్రపంచపు మొట్టమొదటి కార్మికవర్గ ప్రభుత్వం అది. సుమారు 70 రోజుల తర్వాత పారిస్ కమ్యూన్ పతనమైపోయింది. అధికారం తిరిగి బూర్జువాల చేతుల్లోకి పోయింది. సుమారు లక్షమంది కార్మిక యోధులు కమ్యూన్ రక్షణకై పోరాడి తమ ప్రాణాలర్పించారు.

"పారిస్ కమ్యూన్ యోధుల స్మృతికి ఫ్రాన్స్‌దేశపు శ్రామికులే కాదు యావత్ ప్రపంచ కార్మికులూ శ్రద్ధాంజలిఘటిస్తారు. ఎందుకంటే వారు ఏవో కొన్ని స్థానిక సంకుచిత జాతీయ ఆశయాలతో కాక అణచబడ్డ శ్రమజీవులందరికోసం పోరాడిన వీరులు. సాంఘిక విప్లవంకోసం పోరు సలిపిన ప్రథమ యోధులుగా– బాధాసర్పదష్టులైన, పోరాటంలోవున్న, అన్నిచోట్ల శ్రమజీవుల సానుభూతినీ వారు చూరగొన్నారు. పారిస్‌లో ఫిరంగి గర్జన అతిగా వెనుకబడ్డ శ్రామికులనైతం గాఢ నిద్రలోంచి మేల్కొల్పింది. శ్రామికుల పోరాటాలకు, ఐరోపా అంతటా సోషలిజం ఉద్యమాలకు, ప్రతిచోటా విప్లవ ప్రచారంకోసం వూపు నిచ్చింది– అందుకే కమ్యూన్ ఆశయం చావలేదు. ఈనాటికీ మనలో ప్రతివారిలో జీవించేవున్నది.

సాంఘిక విప్లవం, శ్రమజీవుల సంపూర్ణ రాజకీయ, ఆర్థిక వికాసమూ, ప్రపంచ శ్రామికుల అభ్యుదయమూ; ఇవే పారిస్ కమ్యూన్ ఆశయాలు. అందుకే అది అమరమైనది"– ఇవి 1908 లో లెనిన్ అన్న మాటలు.

"కార్మికవర్గం సాహసోపేతంగా మహోన్నతమైన ఆత్మత్యాగాలతో ప్రపంచ చరిత్ర నిర్మించేందుకు తీసుకొన్న 'గొప్పచొరవ' "– అని మార్క్స్ మహాశయుడు పారిస్ కార్మికులకు నివాళులర్పించాడు.

అయితే పారిస్ కమ్యూన్ 70 రోజుల్లోనే పతనమైపోయింది. దీనికి కారణాలు మీరు యీ సంచికలోనే మరోచోట చదువుతారు. కాని ఎక్కడైనా అంతిమ విజయం ఎప్పుడూ కార్మికులదే. ప్రపంచమంతటా యీనాటివరకూ సామ్రాజ్యవాద దోపిడీశక్తులనెదిరిస్తూ తమ విముక్తికోసం కార్మికులు కార్చిన రక్తం, తమ ప్రాణాలర్పించి చెల్లించిన మూల్యం, వృధాపోదు. ఇది రోజు రోజూ ప్రపంచ విప్లవ చరిత్ర రుజువుచేస్తున్న సత్యం. దోపిడీ శక్తులకు వ్యతిరేకంగా 1871 లో పారిస్ కమ్యూన్ కార్మికుల కసి రగిలించిన అగ్ని భూగోళమంతటా వ్యాపిస్తూనే వున్నది.

మార్క్సిజం-లెనినిజం మావో ఆలోచనా విధానం యీనాటి శాస్త్రీయ విప్లవ సిద్ధాంతం. దోపిడీ సమాజాన్ని రూపుమాపి, వర్గరహిత సమాజాన్ని నిర్మించడానికి, నిజమైన అర్థంలో హెచ్చుతగ్గులు లేని సమాజాన్ని స్థాపించి మహోన్నత దశకు కొనిపోవడానికి, శ్రామికుల చేతుల్లో శక్తివంతమైన ఆయుధమే యీనాటి మార్క్సిజం-లెనినిజం మావో ఆలోచనా విధానం.

మార్క్సిస్టు - లెనినిస్టు పార్టీ సరైన మార్గదర్శకత్వంతో కోట్లాది కార్మిక కర్షక శ్రమజీవులు మాత్రమే విప్లవంతేగలుగుతారు. నవసమాజాన్ని నిర్మించగలుగుతారు. కాని కేవలం ఒక నాయకుడో, కొందరు వ్యక్తులో ఎన్నడూ యీ మహాకార్యాన్ని సాధించలేరు.

ఎంత గొప్ప మార్క్సిస్టు మేధావులయినా అధ్యయనం, పోరాటం, విమర్శ ద్వారానే సరైన పంథాను ఎన్నుకోగలుగుతారు. ప్రజాపోరాటాలకు నాయకత్వం నెరపి సరైన మార్గంలో నడుపగలుగుతారు. "ఒకపంథా సరైనదైతే యిక దానికి ఎన్నటికీ ధోకాలేదు. మొదట ఆ పంథాలో ఒక్క సైనికుడు కూడా లేకపోయినా క్రమంగా ఎందరో సైనికులు వచ్చి చేరుతారు-రాజకీయాధికారం లేకపోయినా అది తప్పక వచ్చితీరుతుంది." కాబట్టి శ్రామిక వర్గ విజయానికి కావలసింది సరైన రాజకీయ పంథా, సరైన కార్యక్రమం-మార్క్సిజం-లెనినిజం మావో ఆలోచనా విధానాన్ని భారతదేశ పరిస్థితులకు అన్వయించి చారుమజుందార్ చెప్పిన రైతాంగ సాయుధ పోరాట బాటయే నేటి సరైన పంథా.

* * *

బ్రిటిష్ సామ్రాజ్యవాదుల దోపిడీ గుండెల్లో బాంబులై పేలిన విప్లవ వీరులు భగత్‌సింగ్, రాజగురు, సుఖదేవ్‌ల 44వ వర్ధంతి మార్చి 23 న జరుగుతుంది. బ్రిటిష్ కిరాతకులు యీ ముగ్గురు భారతదేశపు ముద్దుబిడ్డలను 1931, మార్చి 23 న ఉరికంబాలకు ఎరచేసినారు. బ్రిటిష్ దోపిడీదారుల నిజమైన వారసులైన యీనాటి భారతదేశ గాంధేయ పాలకులు తమ యజమానులను మించిన కుటిలనీతితో, కుట్రలతో దారుణమైన ఫాసిస్టుహింసాకాండతో యీ దేశ పీడిత ప్రజావిముక్తి కోసం సాగే సాయుధ రైతాంగ పోరాటాలను నెత్తురుటేర్లలో ముంచుతున్నారు. ఎందరో రైతు గెరిల్లా యోధులను కాల్చి చంపి ఎందరినో విచారణలేకుండా ఏండ్లతరబడి నిర్బంధంలోవుంచి, చిత్రహింసలకు గురిచేస్తున్నారు. కొందరికి ఉరిశిక్షలు వేస్తున్నారు. అయితే విప్లవ వీరుల నెత్తురు త్యాగాలు వృధాపోవు. ఇక్కడి దోపిడీవర్గాల అంతిమ ఘడి

యాలు చేరువలోనే వున్నాయి– భగత్‌సింగ్, రాజగురు, సుఖదేవ్‌ల విప్లవ స్మృతికి సృజన జోహార్లు అర్పిస్తున్నది– కామ్రేడ్స్ భూమయ్య, కిష్టాగౌడ్‌ల కేరళ కామ్రేడ్స్ విశ్వరూపన్, గోపీనాధ్ కురుక్కన్, భాస్కర్‌పిళ్లైల ఉరి శిక్షల రద్దుకై పెద్దఎత్తున ఆందోళనలేవదీయాలని ప్రజలకు విజ్ఞప్తి చేస్తున్నది.

* * *

మార్చి 16 మగ్జింగోర్కీ జన్మదినం. జగమెరిగిన మహారచయిత గోర్కీ. తన విశ్వవిద్యాలయాలైన అట్టడుగు జీవితాల అపారఅనుభవాలనూ, సంఘర్షణలనూ, శ్రామికవర్గ సంస్కృతినీ తన రచనలద్వారా మన కన్నుల ముందు, మన మనసుల్లో సజీవంగా నిలబెట్టిన శక్తివంతమైన విశ్వకళాకారుడు. గోర్కీ 'అమ్మ' నిర్వహించిన చారిత్రక పాత్ర గొప్పది. లెనిన్ స్వయంగా గోర్కీ అభిమాని, మిత్రుడు, మార్గదర్శకుడూ. తనకాలపు యువతరంతో, కార్మికులతో ప్రజాసంఘాలతో సంబంధంపెట్టుకుని నిజమైన ప్రజారచయితగా జీవించిన గోర్కీ మనకు చిరస్మరణీయుడు, ఆదర్శప్రాయుడూ.

---


Statement about ownership & other particulars about the newspaper

**SRJANA**

| | | | |
|---|---|---|---|
| 1. | Place of publication | ... | Warangal 506001 |
| 2. | Periodicity of its publication | ... | Monthly |
| 3. | Printer's Name | ... ... | P. Hemalatha |
| | Nationality | ... ... | Indian |
| | Address | ... ... | Hanamkonda, Warangal 506001 |
| 4. | Publisher's Name | ... ... | P. Hemalatha |
| | Nationality | ... ... | Indian |
| | Address | ... ... | (Same as above) |
| 5. | Editor's Name | ... ... | P. Hemalatha |
| | Nationality | ... ... | Indian |
| | Address | ... | (Same as above) |
| 6. | Names and addresses of individuals who own the newspaper and partners or shareholders holding more tham one percent of the total capital. | | |

I, P. Hemalatha hereby declare that the particulars given above are true to the best of my knowledge and belief.

Sd/- **P. Hemalatha**

*Publisher.*


---

# సిరిమల్లె

వి. వి. గద్దర్

సిరిమల్లె సెట్టుకింద లచ్చుమమ్మో-
లచ్చుమమ్మ
సినబోయి కూర్చున్నవెందుకమ్మో-
ఎందుకమ్మ

మోకాల్ల మట్టుకు
బుర్దలో దిగబడి
ఎద్దోలె ఎనుకకు
ఒక్కొక్క అడుగేసి
నాట్లేసి, నాట్లేసి లచ్చుమమ్మో-
లచ్చుమమ్మ
నడుములే ఇరిగెన లచ్చుమమ్మో-
లచ్చుమమ్మ ॥సిరి॥

కాల్లుగడ్పులు మొక్కి
దొరకు కొయ్యబోతె
వోరిమోపు ఎత్తుకొని
బిర, బిర నడువంగ
కాల్జారి పడ్డావ లచ్చుమమ్మో-
లచ్చుమమ్మ
కాల్ చెయ్యిఇరిగింద లచ్చుమమ్మో-
లచ్చుమమ్మ ॥సిరి॥

నెత్తంత మాసింది
రైకంత చినిగింది
కొత్తది కొననీకి
కైకిలే దొరకది
కుంచి పేల్కలుగట్టి లచ్చుమమ్మో-
లచ్చుమమ్మ
కూలికె బోయినావ లచ్చుమమ్మో-
లచ్చుమమ్మ ॥సిరి॥

పాసిపోయిన బువ్వ
మాడిపోయిన గట్క
చలిగంజి బోసుకొని
సప్పదే మింగుతే
కక్కుడేర్గుడు బెట్టి లచ్చుమమ్మో-
లచ్చుమమ్మ
దొక్కంత గుంజింద లచ్చుమమ్మో
లచ్చుమమ్మ ॥సిరి॥

గాడ్పొచ్చి గుడిసంత
గాలిలెగిరిపాయె
చలికాలమొచ్చింది
చాపచింపులులేవు
బొంత గుడుదామన్న
పాతపేల్కలులేవు
చలికి వొనుకుబట్టి లచ్చుమమ్మో-
లచ్చుమమ్మ
సంబోడు చచ్చిండ లచ్చుమమ్మో-
లచ్చుమమ్మ ॥సిరి॥

అకలితో పోలగాల్లు
అల్లాడిపోవంగ

అన్నారెడ్డికి నీవు
జొన్ననర్కబోతె

కందికొయ్యదిగి లచ్చుమమ్మో-
లచ్చుమమ్మ
కాలంతవాసింద లచ్చుమమ్మో-
లచ్చుమమ్మ ॥సిరి॥

ఏనెగుండ్లకింద
శవుకారి గుడ్డంల
ఎరువుజల్లాబోతె
ఎర్ర తేలుకరిసి

పోట్లుమంటాలెత్తి లచ్చుమమ్మో-
లచ్చుమమ్మ
పోలమంత బొర్లావ లచ్చుమమ్మో-
లచ్చుమమ్మ ॥సిరి॥

దసరపండుగవొచ్చె
దమ్మిచేతులలేదు
దీపావళీవొచ్చె
దీపెంత లేదాయె
శివరాత్రి వొచ్చింది
ఉపవాస ముండాలె

నీ బతుకంత శివరాత్రె లచ్చుమమ్మో
లచ్చుమమ్మ
నీ బతుకంత అమవాసె లచ్చుమమ్మో
లచ్చుమమ్మ ॥సిరి॥

ఏ కర్మమనుకోని
ఏడుపాయలెల్లంగ

గాచారమనుకొని
నాచారమెల్లంగ

తొవ్వలో దొంగలు లచ్చుమమ్మో-
లచ్చుమమ్మ
బువ్వ గుంజుకుంద్ర లచ్చుమమ్మో-
లచ్చుమమ్మ ॥సిరి॥

పక్కింటి పోచమ్మ
ఎనుకింటి ఎల్లమ్మ
ముందింటి ముత్తమ్మ
ఇరుగింటి ఈరమ్మ
కూలోల్ల కందరికి
కూడు దొరకాలని

కొమరెల్లి కొండల్లొ లచ్చుమమ్మో-
లచ్చుమమ్మ
కొలిమి రాజేసింద్రు లచ్చుమమ్మో-
లచ్చుమమ్మ ॥సిరి॥

ఎన్నాండ్లు ఏడ్చేవు
ఎంతని ఏడ్చేవు
ఏడ్చిన తూడ్చిన
ఏమి సాధించేవు
నీతోటి చెల్లెండ్లు
నీ సాటి తమ్ములు
ఎర్రదండులచేరి
ఎత్తింద్రు కొడవండ్లు

కొడవండ్లునూరుకొని లచ్చుమమ్మో-
లచ్చుమమ్మ
కూలిదండులచేరు లచ్చుమమ్మో-
లచ్చుమమ్మ ॥సిరి॥

# నూతన మానవులు

— యాత్రిక్

కమ్యూనిస్టుల త్యాగాలు పోరాటాల పతాకాలు
పోరాటాలు
వర్గస్వభావంలో నవలెత్తి
రాజ్యాధికారంకోసం సాగే సూర్యకాంతిపువ్వులు;

నిర్బంధాలు నిగ్గుదేల్చే నిప్పుకొలుములు
అధ్యయనశిబిరాలు ఆలోచనామజిలీలు

అపజయాలు వర్గకసికి పదునుపెట్టే ఎదురుదెబ్బలు

విజయాలు
విశ్రాంతికితావివ్వని మైలురాళ్ళు

... ... ... ... ... ...
... ... ... ... ... ...

ప్రజలు నేల, కమ్యూనిస్టులు విత్తనాలు
ఫలాలనే పండిస్తారో, మట్టిలో కలిసిపోతారో
ప్రజలతో లీనమయ్యే తీరులోవుంది
కాలాన్నీ ఋతువునూ గమనించడంలోవుంది

... ... ... ... ... ...
... ... ... ... ... ...

ప్రవాహం క్షణంముందు కెరటాన్ని ఈ క్షణంతీసేసినట్లుగా
నిన్నటి ఆలోచనతో ఇవ్వాటి ఆలోచన
సంఘర్షణపడే వర్తమానం కమ్యూనిజం
నిరంతరజీవానుస్పందన రక్తచలన సంగీతం పోరాటదీప్తిగా
సమాజాన్ని చూసేవారు కమ్యూనిస్టులు

... ... ... ... ... ...
... ... ... ... ... ...

కన్నీళ్ళతో రగుల్కొన్న కీలను
చెమటతో బుగుల్కొన్న శక్తినీ
కత్తివాదరగామార్చి
ప్రజాయుద్ధ భేరీ మ్రోగించే
కామ్రేడ్స్, నూతనమానవులు కమ్యూనిస్టులు.

# సాయుధంగా సాగిపోతాం

వరవరరావు

సాగిపోతాం సాగిపోతాం
సాయుధంగా సాగిపోతాం
సాగిపోతాం పోరుతూ
సాగిపోతాం ముందుకు ॥సాగి॥

దోపిడీ వర్గాల కుట్రలు
సాగకుండా సాగిపోతాం
సాగిపోతాం సాయుధంగా
సాగిపోతాం ఆగకుండా ॥సాగి॥

బతుకు బందీఖాన అయినా
గుండెనెత్తురైన పిండి
ఎర్రజెండా విడవకుండా
సాగిపోతాం ఆగకుండా ॥సాగి॥

దమనరాజ్యం చచ్చుదాక
శ్రమకు రాజ్యం తెచ్చుదాక
సమసమాజం వచ్చుదాక
సాగిపోతాం సాయుధంగా ॥సాగి॥

కళ్ళుకాంతులు కదులుదాక
చివరి ఊపిరి మిగులుదాక
వర్గయుద్ధం వదలకుండా
సాగిపోతాం బెదరకుండా ॥సాగి॥

విప్లవం రాపాడుగుండెల
విప్లవం కాపాడుకుంటు
విప్లవం కాపాడుకుంటూ
విప్లవాలను పాడుకుంటూ
సాగిపోతాం పాడుతూ
సాగుతాం పోరాడుతూ ॥సాగి॥

(కోర్టులో పాడగా విని రాసుకున్నది)

# కావలన్న

ఎస్.ఆర్. భోలా

కట్టమీన కట్టెమీన
అనుకున్న కావలన్న
కాకోలె యేకాకోలె
కన్నీరు పెట్టకన్న ॥కట్ట॥

గొడ్లాను కాసినావు
గొడ్లల్ల కలిసినావు
రెక్కాలు విరుసుకున్నా
బుక్కెడు కూడులేదు ॥కట్ట॥

నిద్దూర పొద్దు లేసి
పొద్దూకినాక వత్తవ్
ఈ గిద్దెడు నూకల్ల
బతకాలె పిల్ల లెల్ల ॥కట్ట॥

ససంత్రమొచ్చెనంచు
సంకాలు గొట్టుకుంటె
దొరలంత యెన్నికల్తొ
లైసెన్సు దొంగలైరి ॥కట్ట॥

రంగూలు మారెగాని
రాజరికం మారదాయె
పేదోల్లు పాటుబడితే
దొరగాండ్ల దోపిడాయె ॥కట్ట॥

కార్మికుల రాజ్యమందె
కడతేరును మనగోడు
కన్నీరు పెట్టకన్న
నువు కసిని పెంచుమన్న ॥కట్ట॥

కష్టజీవులంతా
కలిసి నడువాలన్నా
దోపిడీ దొరగాండ్లను
పాతం జేయాలన్నా. ॥కట్ట॥

కథలు :

# నిజమైన ఉక్కుకోట ఏది?

మూలం: చైనీస్ లిటరేచర్ — అనువాదం: సి. వైదయ్య

1947 ఆకురాలుకాలం. పోరాటం ఉధృతంగా సాగుతోంది. శత్రుమూకలను తుడిచిపెట్టాలని ప్రాణాలకు తెగించి పోరాడుతోంది చైనా ప్రజ. తుది విజయంకోసం అనేక మంది వీరులు తమ విలువైన ప్రాణాలను కోల్పోయారు. అనేక మందికి గాయాలు తగిలాయి అయినా పోరు నడుస్తూనేవుంది. నేలకొరిగిన సోదరుల స్థానాలను కొత్తవారు ఆక్రమిస్తున్నారు. గాయపడ్డవారిని పోరాటరంగం వెనుకతట్టుకు పంపిస్తున్నారు. పెర్ల్‌నదీ గెరిల్లాదళ నాయకుడు (Pearl River guerillas detachment leader) లీ-షీ-చిన్ వారిలో ఒకడు. ఆయనకు కాలిమీద బలమయిన గాయం తగిలింది. కోలుకొనేవరకూ 'తెల్లరాళ్ళగ్రామం'లో (White stone village) సిస్టర్ హో ఇంటివద్ద లీ-షీ-చిన్ ఆశ్రయం తీసుకోవాలని నిర్ణయించబడింది.

సిస్టర్ హో భర్త విదేశాలలో వుంటున్నాడు. విదేశాలలో వుంటున్న మరో ఆయనకూడ ఆవూరివాడే. ఆయన పేరు చూ. చూ విదేశాలకు పోతూ తనయింటిని కనిపెట్టుకు వుండమని సిస్టర్ హోకు అప్పగించాడు. అప్పటి నుండి హో చూ యింటిలోనే వుంటూవచ్చింది. తెల్లరాళ్ళ గ్రామం యింకా కొమింటాంగు కిరాయిమూకల చేతుల్లోనే వుంది. కాని దానిని ఆనుకొనే గెరిల్లా ప్రాంతం వుండటం కారణంగా, ఆవూళ్ళోకూడ రహస్యపార్టీ పనిచేస్తోంది.

లీ వచ్చి మూడురోజులయింది. రాత్రి పదిగంటలవేళ తన 12 ఏండ్ల కొడుకు షూ-చెంగ్ తనూ నిద్రపోదామనుకొంటున్నారు అకస్మాత్తుగా ఇంటితలుపు నెవరో బాదుతున్న చప్పుడయింది. హోకు ఆశ్చర్యమేసింది. ఇంత రాత్రివేళ ఎవరు వచ్చి వుంటారబ్బా— అని అనుమానపడింది.

"తొందరగా తలుపుతీయండి. లేకపోతే తలుపు ముక్కలవుతుంది—" కఠినమైన గొంతు. గొంతులోని కఠినత్వంవినగానే తన అనుమానం ధృఢపడింది. వెంటనే షూ-చెంగ్ చెవిలో నాలుగుమాటలు చెప్పి, తలుపు దిక్కుగా వెళ్ళింది.

"ఏం కొంపలంటుకుపోతున్నాయని తలుపులట్లాబాదుతున్నారు ?" విసుగ్గా అంది.

ఉక్రోషంవచ్చింది బయటివాడికి. "నోరుమూసుకొని ముందు తలుపుతియ్యి. మీ ఇళ్ళు సోదాచేయాలి." "సోదాచెయ్యడానికి మాయింట్లో యేముందని ? ఇది 'చూ' గారి ఇల్లని తెలియదా ?" అంటూ తలుపుగొళ్ళెం తీసింది వాళ్ళు 'శాంతిరక్షక దళం' (Peace Preservation) వారిద్దరు. తుపాకులతో లోపలికి తోసుకురాబోయారు.

వారసలు గూఢచారి విభాగంవాళ్ళు. లీ-షీ-చిన్ ఆచూకీ కనుక్కోటానికి ఈ వేషాల్లో వచ్చారు. తమలోని సైనికుడొకడు పారిపోయాడని, వాడికోసం గాలించుతున్నామని బూటకపు కథను అల్లి చెప్పారు.

"మీ ఇల్లూ, పెరడు సోదాచేయాలి—" మొరటుకంఠం.

సిస్టర్ హో రెండుచేతులు ద్వారానికడ్డంగా చాపింది— "ఎవడో మీ సైనికుడు పారిపోతే, దానికీ వూళ్ళోవాళ్ళకు మాకూ సంబంధమేముంది అయినా ఇది చూ గారి ఇల్లు. దీన్ని సోదాచేయటానికి ఏమాత్రము వీలులేదు—" పౌరుషంగా నిలబడింది

"వీలులేదూ ? మాదగ్గర అధికారపత్రముంది. చూస్కో—. ఇది 'చూ' గారి ఇల్లయినా ఎవరిదయినా మేము సోదాచేయాల్సిందే—" అంటూ ఒకడు జేబులో చెయ్యి పెడుతున్నట్టేపెట్టి అకస్మాత్తుగా సిస్టర్ హోను గట్టిగా పట్టుకొన్నాడు. రెండవవాడు ఆమె చేతికిందుగాదూరి లోపలికివెళ్ళిపోయాడు. సిస్టర్ హో వాడిచేతుల్లోనుండి తప్పుకోటానికి గుంజుకొంటోంది. లోపలికెళ్ళినవాడు ఫ్లాష్ లైటుతో ఇంటా బయటా అంతా వెతుకుతున్నాడు. ఆ సమయానికి షూ-చెంగ్ ఆవూరి గ్రామపెద్ద ఓల్డు'మా'ను వెంట బెట్టుకొని తీసుకొచ్చాడు.

సిస్టర్ హో 'మా'కేసి చూస్తూ నిష్ఠూరంగాఅంది— "ఈ అఘాయిత్యం చూడండి ఎవరో వాళ్ళ సైనికుడు పారిపోయాడట. దానికి వూళ్ళోవాళ్ళం మేమా బాధ్యులం ? ఇంత రాత్రిపూట వచ్చి మమ్మలను అగం ఆగం చేస్తున్నారు. గౌరవనీయులైన 'చూ' గారి ఇంట్లోనే ఇలా జరుగుతుంటే... !"

ఆ వూళ్ళోని రహస్యపార్టీకి కూడ నాయకుడు 'ఓల్డుమా'యే. లీ వచ్చిన ఇంత కొద్దికాలంలోనే ఇల్లు సోదా అవటం ఆయనకు ఆశ్చర్యమేసింది. 'సైనికుడు తప్పిపోవటం' కథ అంతా బూటకమని తెలుస్తూనేవుంది. ఎలాగోలాగ ఈ కిరాతకులిద్దర్ని వెంటనే పంపించివెయాలి. ఎట్లా ? వాళ్ళదగ్గరకువెళ్ళి మెల్లిగా భుజంమీద తట్టాడు— "తమ్ముడూ ! సైనికుడికోసం గాలిస్తుంటే, మీరు తప్పు ఇంటికివచ్చారు. చూ గారిప్పుడు విదేశాలలో వుంటున్నారు. ఆయన చాల దేశభక్తిగలవారని అందరికీ తెలిసిన సంగతేకదా ! 1911 విప్లవంలో ఆయన డాక్టర్ సన్యట్ సేన్ అనుచరుడు. ఆరోజుల్లో ఆశయంకోసం చాల త్యాగాలుచేశాడు. జపానువ్యతిరేక యుద్ధసమయంలో మన ప్రభుత్వానికి పెద్ద మొత్తాలలో విరాళాలుకూడ ఇచ్చాడు. మా జిల్లా మొత్తంమీద పేరు ప్రతిష్ఠలుగల వ్యక్తని మీకుకూడ తెలిసేవుంటుంది. అటువంటి ఆయన ఇంటిమీద అనుమానం రావటమేమిటి ? ఇదిగనుక ప్రభుత్వానికి తెలిసిందంటే మీకు, మీ ఉద్యోగాలకు ముప్పువస్తుంది. అంతేగాక 'చూ'గారి ఇంటిని హో పదేళ్ళనుండి కనిపెట్టు

కునివుంటోంది చాల నమ్మకమైన మనిషి. ఇటువంటి ఆమెకు నేరస్థులతో, పారి పోయినవారితో సంబంధం ఎలావుంటుంది ?" అని బెదరగొట్టాడు ఓల్డుమా.

తమ సోదాలో ఆచూకీ ఏమీ తెలియకపోవటంతో, తర్వాతవచ్చే పరిణామాలకు బెదిరిపోయి ఆ కరాతకులు—"నువ్వుచెప్పిందీ రైటే. మేమేదో పొరపాటుపడ్డాం. మీకు కల్గించిన కష్టాన్ని యేమీ మనసులోవుంచుకోకండి"అని పాధేయపడి తమ తుపాకులు భుజానేసుకొని కాళ్ళీడ్చుకొంటూ వెళ్ళిపోయారు

వాళ్ళు కనుచూపుమేర పోయినతర్వాత— "పరిస్థితి చాల ప్రమాదంగా మారి పోతోందని తెలుసుకొన్నావుకదా! 'లీ'ని మరోచోటకు మార్చడం ఈ పరిస్థితుల్లో మరీ ప్రమాదం. చేయకలిగిందల్లా ఒక్కటే— మనం యింకా ఎక్కువ జాగ్రత్తతో వుం డాలి. మన సమాచారశాఖ ఎప్పటికప్పుడు పరిస్థితిని పసిగడుతూవుండాలి."అని తగిన జాగ్రత్తలుచెప్పి వెళ్ళిపోయాడు.

జపాను వ్యతిరేక పోరాటపురోజుల్లోనుండి సిస్టర్ హో గెరిల్లా దళాలకు తన శక్తికొలది సాయంచేస్తూనేవుంది. అనేకసార్లు తన ఇంట్లో గెరిల్లాలకు ఆశ్రియ మిచ్చింది. శత్రువు సోదానుండి వారిని కాపాడటానికి, ఇంటివెనుకవైపు గోడను రెండు గోడలుగా కట్టించి వాటిమధ్యలో మూడు అడుగుల వెడల్పుగలి చిన్నగదిని యేర్పాటు చేసింది. లోపలికి పోవటానికి ద్వారం గోడపైనున్న అటకలో పెట్టింది. శత్రువు సోదా గురించి అనుమానం వచ్చిన మరుక్షణమే గెరిల్లాలను అనేకసార్లు దాచివేసింది. ఆ చోటులోనే యిప్పుడు లీ-షీ-చిన్ కూడ వున్నాడు. అందుకనే ఆ రాత్రి ఆ కిరాతకు లిద్దరూ కళ్ళల్లో ఒత్తులు పెట్టుకుని ఇల్లంతా గాలించినా, లీ ఆచూకి పట్టలేకపోయారు.

మరుసటిరోజు మధ్యాహ్నం సిస్టరు హో లీ గాయానికి కట్టుకట్టడానికి వెళ్ళింది. సోదా సంగతంతా చెప్పింది. కట్టు కట్టడం పూర్తి చేస్తుండగా షూ-చెంగ్ తల పైకి పెట్టి "తలుపుదగ్గర మళ్ళీ ఎవరో తడుతున్నారని"- మెల్లిగా వార్తనందించాడు.

"పరిస్థితిపై ఓల్డు మా అంచనా సరియైనదే నేనిక్కడనుండి కదిలే పరిస్థితిలో లేను. మారటానికికూడ వీలులేదు. కనుక శత్రువుతో ఇక్కడే తలపడవలసివస్తుంది. మన జాగ్రత్తలో మనం వుండి, పార్టీ రహస్య నిర్మాణంపై ఆధారపడితే మనం తప్ప కుండా శత్రువును ఓడించగల్గుతాం- అని లీ-చెన్ ధైర్యం చెప్పి పంపించాడు.

"నాకంతా అర్థమయింది. నేను చూసుకుంటాగా నువ్వు మాత్రం నిశ్చింతగా వుండ"మనిచెప్పి తలుపు తీయటానికి వెళ్ళింది సిస్టర్ హో.

ఈసారి వచ్చినవాడికి దాదాపు 40 ఏళ్లుంటాయి. విల్లుబద్దలా బక్కగావున్నాడు. జిడ్డుగారిన ముఖం. పిల్లి కళ్లు. దొంగ కోళ్లు పట్టేవాడిలా దొంగచూపులు. ఒంటి మీద

ముతకబట్ట కోటు. అతుకుల బొంత. మాసిపోయివుంది. మురికిబట్టిన రెండుదుప్పట్లు భుజాన వేలాడుతున్నాయి. సిస్టరు హో మొదట వాణ్ణి గుర్తుపట్టలేదు. దగ్గరగా పరిశీలించి గుర్తుబట్టిన తర్వాత లోపలికి రమ్మనటానికి సంకోచించింది.

"చెల్లెలా!" వెకిలినవ్వుతో పలకరించాడు- "నన్నుచూసి చాల ఆశ్చర్యపోతున్నావుకదూ, చూసి చాలఏళ్ళయిందా, చూసిపోదామని వచ్చానంటూ" చాక్లెట్లపాకెట్టును జేబులోంచిదీసి మూచెంగ్ చేతుల్లో పెట్టాడు. మరోసమయంలోనయితే మూచెంగ్‌తో మామకు నమస్తే పెట్టమనేదే కాని పదేళ్ళనాడు తమతో తెగతెంపులుచేసుకొన్న తన పెదనాన్నకొడుకు కాన్-సుంగ్-చీ యీ పరిస్థితుల్లో యీ అవతారంతో ప్రత్యక్షమవటం చాల అనుమానంగానేవుంది సిస్టర్ హోకు.

రెండురోజులక్రితం సిస్టర్ హో బాండేజీగుడ్డ కొనాలని పట్టణానికి వెళ్ళింది. పరిస్థితులు చాల తీవ్రంగా మారినాయన్న సంగతి పూర్తిగా గ్రహించలేకపోయింది. పట్టణంలోనేకాక గెరిల్లా ప్రాంతానికి దగ్గరగానున్న గ్రామాలన్నిటిలోనూ గూఢచారుల చక్రబంధాన్ని ఏర్పాటుచేశాడు శత్రువు. లీ-షీ-చిన్ గాయపడి తెల్లరాళ్ళ గ్రామం పరిసరాల్లో ఆశ్రయం తీసుకొంటున్నట్లు చూచాయగ తెలిసింది. లీ అంటె శత్రువుకు హడలు. అనేకసార్లు వారిపై చావుదెబ్బలు కొట్టాడు. చాల నష్టం కల్గించాడు. క్షణంలో ప్రత్యక్షమవుతాడు. మరుక్షణమే అదృశ్యమవుతాడు. పీడ విరగడజేసుకోవాలని అనేకసార్లు వలపన్నారు. కాని లీ ధైర్యం, తెలివిముందు ఉచ్చులన్నీ ఊడిపోతూవుండేవి. అందుకే అతడంటే శత్రువుకంత కసి. మరోపక్క భయం.

ఓటమినుండి పాఠాలు నేర్చుకొన్నాడు శత్రువు. ఈసారి ఎత్తుగడను మార్చాడు. గ్రామాలన్నీ ప్రతి యిల్లూ సోదాచేయటం మానివేశాడు. ఊరూర ఏజెంట్లను దింపాడు. గట్టి నిఘాపెట్టి లీ ఆచూకీ తెలిసినవెంటనే అకస్మాత్తుగా దాడిచేసి, ఏం జరుగుతోందో లీ తెలుసుకొనేలోపలే పట్టుకోవాలని వాళ్ళ ప్లాను.

సిస్టరు హోకు ఈ ప్లాను గురించి తెలియకపోయినా, ఓల్డు మా సూచనలప్రకారం జాగ్రత్తలు తీసుకొంటూనే పట్నంలో తిరుగుతోంది. నెత్తురు, చీము, అద్దడానికి దూది. కొంత మీదపెట్టి కట్టడానికి మామూలుపత్తి కొంత కొని బుట్టలోవేసుకొని పైన తువాలుకప్పి ఇంటికి బయలుదేరింది. కాని తోవలో నల్లటి కళ్ళద్దాలు పెట్టుకొని, టోపీని ముఖంమీదకు లాగుకొని వచ్చేపోయే వాళ్ళను తేరిపారజూస్తున్న ఒక వ్యక్తి కళ్ళల్లోపడింది. వాడివెనుక ఇద్దరు సిపాయిలున్నారు తుపాకులతో సిస్టరు హోను చూడగానే తన ముఖం పక్కకు తిప్పేసుకొన్నాడు. ఆమెను తనిఖీచేయమని ఆ యిద్దరికి సైగచేశాడు.

"ఓ అమ్మాయ్ ! ఎక్కడనుంచి పోతున్నావ్ ?" కరిసినట్టే అడిగాడొకడు.

"మార్కెట్టుకు వచ్చి వెళ్తున్నాను" తాపీగా సమాధానమిచ్చింది సిస్టర్ హో. పత్తివి తీసి వాళ్ళ కళ్ళముందూ అటూ ఇటూ తిప్పిచూపింది. తమ మామూలు తమ కిమ్మన్నట్లు చేతులు చాచారు. ఈ కిటుకులన్నీ హోకు బాగా తెలిసినవే. సిగరెట్టు పాకెట్టును తీసి వాళ్ళచేతుల్లో వుంచింది. "చలికాలం జాకెటు కుట్టించుకోడానికి ఈపత్తి పట్టుకుపోతున్నానవి" అనుమానం రాకుండా కథ అల్లి చెప్పింది. సిగరెట్లు కాలుస్తూ ఆమె బుట్టవంక చూస్తూనే వున్నారు. అనుమానాస్పదమైన వస్తువులేమీ లేకపోవటంతో పొమ్మని చెప్పి సిగరెట్టుదమ్ము పీలుస్తూ వెళ్ళిపోయారు.

నల్లటి కళ్ళద్దాలమనిషే కాన్-సుంక్-చీ. శత్రువు గూఢచారి విభాగంలోవుంటూ వాళ్లు పారేసే ఎంగిలి మెతుకులకోసం సి.ఐ.డి. పనిచేస్తున్నాడు. సిస్టర్ హో గుర్తు పట్టకుండా వుంటానికి తన ముఖం చాటుచేసుకొన్నాడు. వాడి మనుషులిద్దరూ అడుగు తున్నప్పుడు, వాడి కళ్ళన్నీ బుట్టమీదేవున్నాయి అ బుట్టలో రెండురకాల పత్తి వుండ టం, కింద తెల్లనిపత్తి వుండటం గమనించాడు. అది ఆతనికి అనుమానాన్ని రేకెత్తిం చింది– "ఆ తెల్లదూది గాయాలకు కట్టుకట్టడానికి కాదుగదా ? దానిని కింద ఎందుకు దాచింది ? దీని వెనుక ఏదో కారణముంది"– దీర్ఘాలోచనలో ఆఫీసుకు వెళ్లి చూసిం దంతా పైవాళ్లకు రిపోర్టుచేశాడు. సిస్టరు హో ఇల్లు సోదాచేసిరమ్మని వెంటనే ఇద్దరు సాయుధ మనుషుల్ని పంపించారు. కాని ఆ దద్దమ్మలిద్దరూ ముఖాలు వేలాడేసుకొని తిరిగి రావటంతో, కాన్-సుంగ్-చీనే స్వయంగా వంపించాలని శత్రువు నిర్ణయించు కొన్నాడు. మూడు రోజుల్లోపల యీ రహస్యాన్ని కనుక్కోవాలని గడువిచ్చారు. అందుకే సిస్టరు హో ఇంటికి వీడి రాక.

తన దుప్పట్లను కింద పెట్టాడు. సిస్టర్ హో ఒక కప్పు టీ అందించింది. పిచ్చాపాటీ మాట్లాడుకొంటున్నా రిద్దరూ. గెరిల్లాలతో ఆమెకున్న సంబంధం తెలుసు కోడం పెద్ద కష్టం కాదనుకొన్నాడు కాన్. అదీకాక తనకు చాల అనుభవమున్నదాయె యీ రంగంలో. ఎదురుగావున్నది మామూలు ఆడమనిషేనాయె. ఇదీ వాడి అంచనా. తమకు దూరమైన ఈ పదేళ్ళలో కాన్ ఎలా మారాడో తెలుసుకోవాలని సిస్టర్ హో ఆలోచన. శత్రువుకు వ్యతిరేకంగా సంవత్సరాలనుండి సాగుతోన్న యీ పోరు మూలంగా నిశితమైన వివేచనాశక్తి తన చెల్లెలు సంపాదించిందన్న సంగతి కాన్‌కు తెలియదాయె ప్రత్యేకంగా రాత్రి పోలీసుల సోదా జరిగినప్పటినుంచి చాల జాగ్రత్తతో వ్యవహరిస్తోంది సిస్టరు హో.

బంధువులు, స్నేహితులచుట్టూ నడిచింది వాళ్ళ సంభాషణ. కాసేపు ఒకరిపై ఒకరు జోకులు విసురుకొన్నారు. ఎదుటివాడి గుట్టు తెలుసుకోవాలని ఎవరికి వారు తంటాలుపడుతున్నారు.

సిస్టరు హో చిన్నగా మొదలెట్టింది— "సుంగ్-చీ, నిన్నుచూసి పదేళ్ళయింది. క్వాంగ్ చౌకు నీకు పని బాగా దొరికిందని, బాగా డబ్బు వెనకేశావని జనాలను కొంటు న్నారు నిజమేనా ?"

కాన్ తత్తర బిత్తరయ్యాడు. మామూలు ధోరణిలో అనాలోచితంగా సిస్టర్ హో అన్నమాటలు వాడికి సూటిగాతాకాయి. జపాను వ్యతిరేకయుద్ధంలో కాన్ ఆ నగరంలో శత్రుగూఢచారి విభాగంలో పనిచేశాడు. జపాను సైన్యం లొంగిపోయిన తర్వాత కొమిటాంగు రహస్య పోలీసులోకి చేర్చుకోబడ్డాడు. తన గుట్టంతా సిస్టరు హోకు తెలుసా అని భయపడ్డాడు. కాని ఆమె ముఖం ప్రశాంతంగా అనుమానానికి తావులేకుండావుంది. దాంతో కొంచెం కుదుటబడ్డాడు.

"ఏమి వెనకేయటమో, ఏందో. నా బట్టలు చూడు, ఇవే చెపుతాయి నాపదేళ్ల బతుకుగూర్చి. నా బతుకు గురించి చెప్పానంటే అది మన కుటుంబానికే పరువుతక్కువ. కాని ఏంచేసేది, ఎలాగో జీవిని పోషించాలిగా. అందుకే కొన్నాళ్ళు కూరగాయలు అమ్మాను. కొన్ని రోజులు కూలీగా, రిక్షావాలాగా..." కళ్ళవెంట నీళ్ళు గార్చటం మొదలెట్టాడు.

కాన్‌గాడి యీ ఎత్తు హో మీద ఏమాత్రం పారలేదు. ఆమె మనసును కదిలించలేకపోయింది. కాని వాడిపై సానుభూతి చూపిస్తున్నట్లు నటిస్తూ— "అవును. నిజమే. మనదేశమే గందరగోళంలో మునిగిపోతోంది. చాల గడ్డురోజులొచ్చాయి మనకు"—

తన నటన బాగానే సాగుతోందని, హో నమ్మకం సంపాదించానని సంబరపడ్డాడు. కాలుమీద కాలువేసుకొని వూపుతూ ఇంటికప్పుకేసి చూడసాగాడు. మధ్యలో యేమనుకొన్నాడో. యేమో. ఒక్కసారిగా లేచి నుంచొన్నాడు. తన పొగాకు సంచిలోనుండి సిగరెట్టు బయటకుతీసి వేళ్ళమధ్య తిప్పటం మొదలెట్టాడు.

ఈ చేష్టలన్నీ సిస్టరు హో నిశితంగా చూస్తూనేవుంది. వాడి చేతులు కూలిపని చేసినోడి చేతుల్లాలేవు. వాడి కుడిచేయి చూపుడువేలు, మూడోవేలు మధ్య సిగరెట్లు తాగి తాగేమో నల్లటిమచ్చ లేర్పడ్డాయి. వాడి పోకడలు చూస్తుంటే అనుమానం ఎక్కువౌతోంది.

"సుంగ్-చీ; ఇంతకీ ఎన్నడూరానోడివి, దారి తప్పి ఇటు ఎందుకువచ్చినట్టు..."

"నిన్ను సాయం అడగాలని వచ్చాను. ఈ బతుకు ఎన్నాళ్ళని బతకను? ఏదో పని నువే చూసిపెట్టాలె. ఇంట్లో గెరిల్లావున్న ఈ సమయంలోనే ఎన్నడూరానోడు సాయంగావాలంటూ రావటమేమిటి? సిస్టర్ హో తనకుతాను ప్రశ్నించుకొంది. "నేనా ఆడదానిని. నీకు సాయం నేనేమీ చేయగలనూ?" తలవూపుతూ నవ్వింది. "నువ్వు

చెప్పింది నిజమే" నిస్సహాయతతో నిట్టూర్చినట్లు కాన్ నటించుతూ— "బాబాయే కనుక బతికుంటే మన పరిస్థితే వేరుగావుండేది. ఏం చేస్తాం. ఎప్పుడూ మంచివాళ్ళకే చావు తొందరగా వస్తుంది" అంటూ సానుభూతి ప్రకటించాడు.

చెల్లెలువంక ఒక దొంగచూపు చూశాడు. తానాశించినట్లే తన మాటలు ఆమె మీద పనిచేసినాయి. ముఖమంతా విచారం అలుముకొంది. ఎవరైనా తన తండ్రిమాట ఎత్తగానే ఆమె గుండెల్లో విచారం నిండుకొనేది. ఆయనొక గొప్ప విప్లవకారుడు. 1927 విప్లవం ఓడిపోవడంతో కొమింటాగు కసాయిమూకలు ఆయనను పైశాచికంగా చంపివేశాయి.

"బాబాయిని తల్చుకొన్నప్పుడల్లా నాలో కొమింటాంగు కిరాతకులమీద కసి పెరిగిపోతోంది. నిజం చెప్పాలంటే, ఆయన ఆశయం నెరవేర్చడానికే నేనింకా బతికున్నాను" మొసలికన్నీళ్లుగార్చాడు కాన్.

ఈ మాటలు ఇంకెవరి నోటినుండి వచ్చినా, ఆశ్చర్యపడేదికాదు సిస్టరు హో. తన తండ్రిని ఆ కసాయివాళ్లు చంపిన రోజుల్లో మొట్టమొదటగా తమతో సంబంధాలు తెంచుకొంది యీ నీచుడే. ఆ రోజులన్నీ గుర్తేవున్నాయి హోకు. అటువంటివాడు కొమింటాంగుపై ప్రతీకారం తీర్చుకోవడమా? చాల వెగటనిపించాయి వాడి మాటలు. తన అనుమానం మరింత ధృవపడింది.

ముఖమంతా కందగడ్డలాచేసింది. "పిచ్చిపిచ్చిగా వాగకు నాన్న మాకేమివదిలిపోయాడని? ఇన్ని సంవత్సరాలనుండి జిల్లా అధికారులు, గ్రామపెద్ధలు మమ్మలను "కమ్యూనిస్టు కుటుంబము"అని ముద్రవేసి, వచ్చినప్పుడల్లా డబ్బో, ధాన్యమో ముట్టజెప్పాలని బలవంతంగా వసూలు చేస్తున్నారు. ఇక చుట్టాల సంగతా, కుష్ఠువాళ్ళను వెలివేసినట్లు కన్నెత్తయినా చూడటంలేదు- నిష్ఠూరంగా పలికింది సిస్టరు హో.

చివరి మాటలు కాన్ నుద్దేశించి అన్నవే. ఇది కాన్‌కు కూడ తెలుసు. కాని తానేమి వినసట్లు ఎటో చూస్తున్నాడు. తన కుర్చీని హో దగ్గరకు లాక్కొని, చెవులో "చెల్లీ, నీకు తెలియదుగాని కొన్నేళ్ళు పోయిన తర్వాత 'కమ్యూనిస్టు కుటుంబం' అనే మాటకు చాల విలువ వస్తుంది. కొమింటాంగు రాక్షసులు ప్రజలను నానావిధాల అణచి దోపిడీ చేస్తున్నారు. ప్రజలింకా సహించేటట్లులేరు. వాళ్ళ చావు రోజురోజుకీ దగ్గర పడుతోంది. అందుకే నీ సాయం కోసం వచ్చాను" ఇంకా ఏదో చెప్పాలనుకొన్నాడు. కాని ముందు వెనుకలాడుతున్నాడు. అది గ్రహించి, వాడి గుట్టు తెలుసుకోవాలని— "అన్నా చెల్లెళ్ళమధ్య భయం, అనుమానం ఎందుకు చెప్పు? నేనెవరికి చెప్పనులే"అని ప్రోత్సహించింది.

అదను వచ్చిందనుకొన్నాడు కాన్. ధైర్యాన్ని కూడదీసుకొని, నేలకేసిచూస్తూ "నేను గెరిల్లాలతో చేరాలనుకొంటున్నాను. కమ్యూనిస్టుపార్టీ అధికారంలోకివస్తే, ఆ ప్రభుత్వంలో మంచి స్థానం వుంటుంది. ఆరోజే మన కుటుంబగౌరవంకూడ నిలబెట్ట బడుతుంది. నాకు తెలుసు నీకు గెరిల్లాలతో సంబంధం..."

సిస్టర్ హో ఒక్కసారిలేచి నిలబడింది— "నా పిల్లోడు, నేను ఈ వూళ్లోబతకా లనుకొంటున్నావా, లేదా? నాన్న చేసిందానికే ఇప్పటికీ ముప్పతిప్పలుపడుతుంటే, మేమేదో ఇలాగన్నా బతుకుతున్నామనా, మా బతుకుల్లో నిప్పులుబోయటానికివచ్చావు? ఊరిపెద్దలకు యీ విషయం తెలిసిందంటే, మా బతుకులేంగాను?" అంటూ గట్టిగా అరవటం మొదలెట్టింది సిస్టరు హో.

కాన్ చాల నిరుత్సాహపడిపోయాడు. తన ప్లానులన్నీ ఓడిపోతున్నాయి. ఏం చేయటం? సిస్టరు హోకు కాన్ అసలురంగు పూర్తిగా బయటపడింది.

ఇంతలో షూచెంగ్ గంతులు వేసుకొంటూ వాళ్ళమ్మదగ్గరకు వచ్చాడు.

"అమ్మా! ఆకలిగావుందే, అన్నంతిందామా?"అంటూ లోపలినుంచి ఉడక బెట్టిన ఆలుగడ్డలు తీసుకువచ్చాడు. అలుగడ్డలు కాన్ముందుంచుతూ "మామయ్యా, నువ్వూ ఒకటితీసుకో"అని అందించాడు.

ఉడకబెట్టిన ఆలుగడ్డలు తినాల్సివచ్చేటప్పటికి ముఖంలో రంగులుమారాయి. "చెల్లీ!"— కాన్ నీరసంగా గొణిగాడు— "రోజూ మీరుతినేవి ఇవేనా?"

"మరేమనుకొంటున్నావు? బంగారం తింటున్నామనుకొన్నావా?"— నిట్టూర్చింది హో— "అసలే రోజులు చాల గడ్డుగావున్నాయి. విదేశాలనుండి ఆయన పంపించగలి గేదే చాల తక్కువ. వాటిల్లో ఇంకా "నౌక ప్రయాణ కార్యాలయం"వాళ్ళు అన్ని కోతలుకోసి, నాదగ్గరకు చేరేటప్పటికి మిగిలేవే వాటిలోసగం. బజారులో ధరలేమో ఆకాశాన్నంటుకొంటున్నాయి. డబ్బువిలువేమో పడిపోతోంది. ఈ తిండితో సరిపెట్టు కోకపోతే, బండినడవటం ఎట్లా?"

"నిజమేలే, అయినా ఆలుగడ్డలూ బాగానేవుంటాయి"నసిగాడు కాన్. అయిష్టం గానే ఒకటితీసుకొని బలవంతంగా నోట్లో కుక్కుకొన్నాడు. కాని తనచెల్లెలు, మేన ల్లుడు తోలుతోనే ఆలుగడ్డలను తింటున్నారు. తనుకూడ తోలుతోపాటే తినాలా, వద్దా? సందిగ్ధంలోపడ్డాడు. లేకపోతే అనుమానం వస్తుందేమోనని భయంతో,. చివరకు ఒక ముక్కను తోలుతోనే నోట్లోకి కూరుకున్నాడు. కాని దాంట్లో కొంత కుళ్ళిపోయిన భాగంవుంది. దాంతో నోరంతా వాసనవేస్తోంది. ఏంచేయాలి. బయటకు కక్కాలా లేక కళ్ళుమూసుకుమింగాలా? ఏంచేయాలో తోచటల్లేదు. ఆలస్యమయితే వాంతి వచ్చేట

త్తుంది. నిజానికి, అతనెపుడు ఆలుగడ్డలు తిని బతకలే. పేదప్రజలకైతే ఏదితినాలో, ఏది పారవేయాలో తెలుసు. మామూలుగా కుళ్ళినభాగాన్ని, మచ్చబడిన తోలును పారవేస్తారు. కాన్ కనీసం ఎప్పుడైనా పేదోళ్ళమధ్య బతికివుంటేగా ఇవన్నీ తెలియటానికి. కళ్ళుమూసుకొని బలవంతంగా మింగివేశాడు. కాని కుళ్ళిన దుంపవాసనకు భరించలేక, వెంటనే బయటకు పరిగెత్తుకొంటూవెళ్ళి కక్కివేశాడు. ఇదంతాచూస్తూంటే సిస్టర్ హోకు కాన్ గత జీవితంమీద, వాడుచెప్పిన మాటలపైన అనుమానాలు పెరగసాగాయి.

భోజనాలతర్వాత "ఊళ్ళోకి కొత్తవారెవరువచ్చినా, వారిపై నిఘావుంటుంది. నీపేరు గ్రామ ఆఫీసులో చెప్పివస్తానంటూ" సిస్టరు హో, పిల్లవాణ్ణితీసుకొని గ్రామ పెద్ద వద్దకు వెళ్ళింది. సిస్టరు హో జరిగిందంతా ఓల్డుమాతో చెప్పింది. జాగ్రత్తగా విన్నతర్వాత, కొద్దిసేపు ఆలోచించి— "నీవుమాత్రం జాగ్రత్తతో ప్రవర్తించు, సమయంచూసి మనం వాడిపని.........." తర్వాతమాటలు చెవులోచెప్పాడు ఓల్డుమా.

ఇంటికి తిరిగివస్తూ షూ-చెంగ్‌తో మాట్లాడింది. తెలివికలవాడైనా, ఒక్కొక్కప్పుడు నోరు జారవచ్చుకదా! "షూచెంగ్, రాత్రి నోదా చూశావుకదా. ఇవాళేమో ఏన్నడూరాని 'మామ' ప్రత్యక్షమయ్యాడు. వాడి చేష్టలన్నీ గమనిస్తూనేవున్నావుకదా! దీనివెనుక పెద్ద కుట్రవుంది. నువు ఇంకా జాగ్రత్తగా వుండాలి."

"నాకర్థమయిందిలే అమ్మా! నావలనమాత్రం ఏ కొంచెం పొరపాటు జరగకుండా జాగ్రత్తపడుతూ ఎప్పుడూ వాణ్ణి కనిపెటుతూవుంటాను" హామియిచ్చాడు షూ-చెంగ్.

మరునటిరోజు వుదయం నిద్రనుండి లేచినప్పటినుండి అనుమానం రాకుండా కాన్‌ను ఒకకంట కనిపెడుతున్నాడు షూ-చెంగ్. కాన్ బయట మొఖం కడుక్కొంటుంటే, చదువుకొంటున్నట్లు నటించుతూ ఆ పరిసరాల్లోనే గడిపాడు. కాన్ ఇంట్లోకి వెళ్ళగానే, స్టూలుతెచ్చుకొని, చేతులోపుస్తకంతో తలుపుదగ్గర తిష్టవేశాడు. కాన్ మెల్లిగా చెత్తకుండీదగ్గరకువెళ్ళి, దాంట్లో జాగ్రత్తగాచూశాడు. కాసేపుచూసి, తర్వాత ఇంటి నాలుగువేపుల కిందా పైనా కళ్ళతో వెతకసాగాడు కాన్. కాన్‌యొక్క ప్రతి కదలికను నిశితంగా పరిశీలించుతున్నాడు. షూ-చెంగ్ అనుమానం కలుగకుండానే, కాని కాన్‌కు ఎక్కడ ఆధారమేమీ దొరకటంలేదు. చికాకు ఎక్కువవుతోంది. మెల్లగా కాన్ మరుగుదొడ్డిలోకి దూరబడ్డాడు వెంటనే షూ-చెంగ్ మునివేళ్ళమీద నడుచుకొంటూ చిన్నగావెళ్ళి మరుగుదొడ్డి గోడకానుకొని లోపల యేంచేస్తున్నాడోనని నిశ్శబ్దంగా నిలబడ్డాడు. లోపల కాన్ వెదురుపుల్లతో నేలనుతవ్వుతున్నశబ్దం షూ-చెంగ్ చెవుల్లో బడింది.

సిస్టరు హో నుండి సమాచారం రాబట్టాలనిచేసిన ప్రయత్నాలన్నీ విఫలమవ్వటంతో, మార్కెటులో తనుచూసిన దూదిజాడ కనుక్కోవాలని నిశ్చయించుకొన్నాడు కాన్. లీ-షి-చిన్ గనుక ఈ ఇంట్లోవుంటే, గాయాలను శుభ్రపరచినదూది, కట్టుకట్టిన గుడ్డ, బహుశా సామాను గదిలోగాని, మరుగుదొడ్డిలోగాని దాచివుండవచ్చని ఊహించాడు కాన్. ఇంటిలో ఎక్కడ దాచిఅచూకీ కన్పడటంలేదు. అందుకే ఆ రెండుస్థలాలు గాలించటం మొదలుపెట్టాడు కాన్.

మరుగుదొడ్డిలో తవ్వుతున్న చప్పుడువిన్న మా-చెంగ్ పరుగెత్తుకెళ్ళి పొయ్యి దగ్గరవున్న అమ్మతోచెప్పాడు. కాన్ తనయింటికి ఎందుకువచ్చాడో ఇప్పుడు పూర్తిగా అర్థమయింది సిస్టరు హోకు. లీ-షీ-చిన్ గాయాలకుకట్టిన దూదిని, గుడ్డను జాగ్రత్తగా పూడ్చిపెట్టింది మరుగుదొడ్డిలోనే. దానిని తవ్వితీశాడంటే, లీ-షీ-చిన్ తన ఇంటిలోవున్నట్టు నిర్ధారణకు వస్తాడు. కనుక వాడిని పక్కతోవ పట్టించాలంటే ఎట్లానని ప్రశాంతంగా ఆలోచించింది. పొయ్యిలోమంట చూస్తూవుండమని తన కొడుకును పురమాయించి, సిస్టరు హో తన రూములోకివెళ్ళి బల్లమీదున్న చాకుతీసుకొని, తన పాంటు పైకిమడచి, చాకుతో కాలుమీద గాయంచేసుకొంది. గాయంనుండి రక్తం బలబల కారుతోంది. నొప్పి తీవ్రంగావుంది. నుదిటిన చెమటలుపోసినై. అయినా భరించాలి ఇదే పరీక్షసమయం. ఎలాగైనాసరే కాన్ను పక్కతోవపట్టించాలి. తనదానికన్న తీవ్రమైనగాయాన్ని లీ-షీ-చిన్ ఏవిధంగా ఓపికతో సహించగల్గుతున్నాడో గుర్తుకురాగానే, సిస్టరు హో మనసు గట్టిపరచుకొంది, గాయాన్నిదూదితోఅద్ది, శుభ్రంచేసింది. లీకి వాడుతున్నమందువేసి రక్తంకారకుండా ఆపింది.

గాయానికి కట్టుకొంటుండగా, కాన్ మరుగుదొడ్డి తలుపుతెరుచుకొని చిరునవ్వులు చిందిస్తూ, ఈలవేసుకొంటూ బయటకువస్తున్నాడు. అంటే అర్థం మరుగుదొడ్డిలో పూడ్చినదూది దొరికిందన్నమాట. అయినా హో ఏమాత్రం చలించలేదు. కాన్ తలుపు ఓరగా తొంగిచూశాడు, సిస్టరు హో చేతిలో దూదివుండటంచూసి 'దొంగదొరికింది'అనే విజయగర్వంతో బయటకువచ్చి తన ప్లానుపారిందన్నట్టు ఒక విషపు నవ్వు విసిరాడు. దగ్గరకువచ్చిన తర్వాతగాని ఆమెకాలిపై గాయం, నేలమీద రక్తంతో తడిసినదూది చూడలేదు. అవిచూడగానే ఒక్కసారి ఖంగుతున్నాడు. తన ఆలోచనలుతారుమారయ్యాయి. ఉత్సాహం చచ్చిపోయి గొంతుమారిపోయింది.

"—కాలిమీద ఏమయ్యింది. నీకు" అడిగాడు నీరసంగా, తికమకపడుతూ. "కొట్టుకు వెళ్ళవస్తుంటే పిచ్చికుక్క నిన్నకరిచింది"—నింపాదిగా సమాధానంచెప్పింది సిస్టరు హో.

సమాధానం వినగానే, పిచ్చికుక్క తననేకరిచినట్లుగా మారిపోయాడుకాన్. ముఖం మీద చిరునవ్వు మాయమయింది.

ఆ సాయంకాలం కాన్ బయటకువెళ్ళాడు. ఈ అవకాశం తీసుకొని, కొడుకును బయట కాపలావుంచి, అటకయెక్కి జరిగినదంతా విపులంగా లీ-షి-చిన్‌కు చెప్పింది సిస్టరు హో. కాసేపు ఆలోచించి దృఢమైనస్వరంతో-"సరే. జాగ్రత్తగా కనిపెట్టి వుండండి. వాడిమీద అనుమానం దృఢమయితే, ఓల్డుమాతో సంప్రతించి గుట్టుచప్పు డవకుండా వాడ్ని సఫాచేయండి." తన నిర్ణయాన్ని చెప్పాడు కామ్రేడ్ లీ.

అటకదిగి వచ్చిన తర్వాత సిస్టరు హో— " 'మామ'చాల క్రూరుడు. ద్రోహి. కామ్రేడ్ లీ ఆచూకీ కోసమే ఎన్నడు మన ముఖం చూడనివాడు యిక్కడ ప్రత్యక్ష మయ్యాడు. నువ్వు ఇంకా జాగ్రత్తగా వుండాలి" అని లీ తనకు చెప్పినదంతా కొడుకుకు చెప్పింది.

"అయితే మనమేంచేయాలి?" అడిగాడు షూచెంగు. కొడుకుచెవిలోచెప్పింది తల్లి చేయవలసిందంతా.

"సరే, నేను తయారుచేస్తానుగా" ఉల్లాసంగా అన్నాడు పిల్లవాడు.

మరుసటిరోజు మధ్యాహ్నం, అన్నం తిన్నతర్వాత షూచెంగ్ చప్పుడుకాకుండా నిచ్చెన తీసుకువచ్చి అటకగోడకు వేశాడు ఏమీతోచక కాన్ గదిలో అటూ ఇటూ పచార్లుచేస్తుంటే బయట చప్పుడు వినవచ్చింది. ఏమిటో తెలుసుకొందామని బయటకు పరుగెత్తుకొచ్చాడు కాన్. షూచెంగు చేతిలో అన్నపుగిన్నె పట్టుకొని నిచ్చెన ముందు నిలబడి వున్నాడు. తన చుట్టూ కలియజూసి గబగబా నిచ్చెనపైకి వెళ్ళిపోయాడు.

ఇదంతా చూస్తూనే వున్నాడు కాన్. తనలో అనుకొన్నాడు— "ఇదన్నమాట సంగతి. నాకు ఉదయమే అనుమానము వచ్చింది. ఇంట్లో ముగ్గురువుంటే, నల్గురికి వంట ఎందుకు వండాలి? లీ-షి-చిన్ ఇక్కడే వున్నాడన్నమాట. పిల్లవాడు ఇప్పుడు అన్నం తీసుకువెళ్లాడుకదా అంటే లీ పైనే వుండి వుంటాడు" పిల్లవాడు అటక మీదకు వెళ్ళిపోయేదాక వేచియున్నాడు- పరుగెత్తుకు నిచ్చెన దగ్గరకు వెళ్లాడు. నిచ్చె నెక్కటం మొదలెట్టాడు. పిల్లవాణ్ణి, లీని వాళ్ళకు తెలియకుండానే రెడ్‌హేండెడుగా పట్టుకోవాలని అతని ప్లాను. నిచ్చెన మెట్లు గబగబా ఎక్కుతున్నాడు. ఒకటి-రెండు-మూడు-నాల్గు-ఐదు ఫట్-ఫట్-ఫట్... ఆరవమెట్టు విరిగిపోయింది. విలను దెబ్బకు కిందబడ్డాడు. ముఖం నేలకు తాకింది. పెదాలవెంట నెత్తురు. పళ్లు కదిలినాయి. అదృష్టవశాత్తూ ఎముకలేమీ విరగలేదు. ఏమీ ఎరగనట్లు షూచెంగు తలబయటకుపెట్టి- "మామయ్యా, పడ్డావా! ముఖంనిండా నెత్తురేమిటీ?" అంటూ పెద్దగా కేకవేశాడు. మిగిలిన ప్రాణంకాస్తా పైకిపోయింది.

ఇదంతా సిస్టరు హో పన్నిన ఎత్తుగడే. నిచ్చెన ఆరవమెట్టు ఎప్పుడో విరిగి వుంది. దానికి బదులు చిన్న పుల్ల అడ్డంపెట్టి, ఆ మెట్టుమీద కాలు వెయ్యకుండా, దానిపై దానిమీదవేసి ఎక్కమని కొడుక్కు చెప్పింది. పాపం ! కాన్‌కు యీ కిటుకేం తెలుసు. దభీమని పడ్డాడు. ఫలితం అనుభవించాడు.

కొడుకు కేక వినగానే సిస్టరు హో లబోదిబోమంటూ మొత్తుకొంటూవచ్చింది- "సుంగ్-చీ, అంత అజాగ్రత్తగా ఎందుకున్నావు ? నిచ్చెన అసలే ఓటిదాయే. ఐనా పైన ఏం పనుందని ఎక్కబోయావు ?" అని నిలదీసింది.

"పైన బల్లవుందేమో చూద్దామని" బొంకాడు కాన్ దవడ సరిచూసుకొంటూ. మాటల్లో అబద్ధంగ్రహించినా. సిస్టరు హో వెంటనే నిచ్చెన బాగుచేసి- సరే, అయితే పైకిఎక్కు. నీకు కావలసిందే తెచ్చుకో" అని అటక గోడకు నిచ్చెన వేసింది. అటకలోనే లీ దాగివున్నాడనే కాన్ అనుమానం పోగొట్టాలనే అలాచేసింది. ఒకవేళ కాన్ పైకి, వెళ్ళిన లీ దాగివున్న స్థలం కనిపెట్టలేడనే గట్టి నమ్మకం హోకు వుంది అక్కడికి పోయేద్వారం తలుపు చాల సున్నగావుండి లోపలిపక్క బోల్టువేసివుంటుంది అటకలో కలిసిపోయేవుంటుంది. చాల జాగ్రత్తగా చూస్తే తప్ప కనుక్కోలేం.

మూల్గుతూ పైకి ఎక్కాడు కాన్. పైనెక్కడా లీ జాడ కన్పడలేదు. కాని పిల్లి ఒకటి తన పిల్లలతో అన్నపుగిన్నె నాకుతూవుంది. నిరుత్సాహంతో నిట్టూర్పువిడిచాడు కాన్. కాని తన ఓటమిని ఒప్పుకోదలచలేదు. అటక మొత్తం జాగ్రత్తగా పరిశీలించాడు. ఇంట్లోని మిగిలిన గోడలకన్నా అటకక్రిందనున్న వెనకవైపు గోడ వెడల్పు ఎక్కువగా వున్నట్లు తోచింది తన మనసుకు. అంటే ఈ వెనకగోడలో రెండుగోడలు లేవుకదా ! ఉంటే వీటిమధ్య మనిషి వుండేటంత స్థలం యేర్పాటుచేయటానికి వీలుంది కదా! తన తెలివి తేటలకు తనే సంబరపడి. మెల్లిగా కిందికి దిగివచ్చాడు.

వెంటనే ఆ గోడ వెడల్పు ఎంతో తెలుసుకోవాలని అనుకొన్నాడు. కాని సిస్టరు హో ఇంట్లో వున్నంత సేపు, ఆమె చూపునుండి తప్పించుకోటం అసాధ్యం. కాళ్లీడ్చుకొంటూ తన గదిలోకి వెళ్లిపోయాడు. కిందపడినప్పుడు దెబ్బతాకిందేమో, బాగానొప్పి పుడుతోంది వీపు. "నా తడఖా తొందరలోనే చూపిస్తాలే" తనలో తాను సమాధానపడుతున్నాడు వీపు రుద్దుకొంటూ.

మరుసటిరోజు ఉదయం తెల్లవారుఝామునసే. కాన్‌ను జాగ్రత్తగా కనిపెడుతూ వుండమని కొడుక్కు చెప్పి- మార్కెట్టుకు వెళ్తున్నాననే నెపంతో సరాసరి ఓబ్రమా పద్దకు వెళ్ళింది సిస్టరు హో. ఈ అవకాశం జారవిడుచుకోరాదనుకొన్నాడు కాన్. మేనల్లుడ్ని దగ్గరకుపిలిచి- "ఇవిగో, ఈ డబ్బులు తీసుకొని, చాక్లెట్లు కొనుక్కోపో" అని డబ్బులివ్వబోయాడు.

"వద్దులే. నాకిప్పుడు చాక్లెట్లేమీవద్దు" ఖండితంగా సమాధానమిచ్చాడు షూ-చెంగ్.

"అయితే నాక్కావాలని, నాకన్నా తెచ్చిపెట్టు" బతిమాలాడు కాన్.

దానిక్కూడ నిరాకరించాడు షూ-చెంగు.

పిల్లవాడేకదా మాయచేయవచ్చని, మరో ఎత్తువేశాడు కాన్ —"షూ-చెంగు. నీకొక పరీక్ష పెడతాను. చెప్పుచూద్దాం. ఈ గోడ ఎంత పొడవు, వెడల్పు వుంటుంది?"

షూ-చెంగు ఏమీ చెప్పలేదు. "సరే, నీవు చెప్పలేకపోతే నేను కొల్చిచెప్తాలే" అని కాన్ అడుగులతో నేలను కొలవ నారంభించాడు. కాన్ చేస్తున్నదేమిటో మొదట షూ-చెంగుకు అర్థంకాలేదు. కాని అతనిని జాగ్రత్తగా పరిశీలిస్తూనే వున్నాడు. నేల వైశాల్యం, గోడ వెడల్పు సరిజూసుకొంటానికి కాన్ మరల కొలవబోయినప్పుడుగాని, గోడలోని రహస్యస్థలం కనుక్కోటానికే ఈ ప్రయత్నమంతా నని షూకు తెలియలేదు. ఇప్పుడేంచేయాలి? వెంటనే ఓల్డుమాకు తెలియజేయాలి. చప్పుడుకాకుండా జారుకొన్నాడు షూ.

పిల్లగాడు ఎందుకు పోయాడో కాన్‌కు అర్థంకాలేదు. ఆటలకుపోయి వుండవచ్చని సమాధానపడ్డాడు. షూ-చెంగు ఇంట్లోలేదుకదా! ఇక మొత్తం తన యిష్టం వచ్చినట్లు సోదాచెయ్యవచ్చు. తను కొలిచింది, తను ఊహించింది సరిపోయేటప్పటికి చిరునవ్వు నవ్వుకొన్నాడు. తన్నుతానే అభినందించుకొన్నాడు. "మొన్ననే జ్యోతిష్కుడొకడు కలిసి ఈ సంవత్సరంలో మంచి పదవి, అదృష్టం కలిసివస్తుందనిచెప్పాడు." గాలిమేడలు కట్టడం మొదలెట్టాడు– "ఇంత తొందరలో తగులుతుందని కలలోకూడ వూహించలేదు. ఈ అడముండ నన్ను చాల తిప్పలుపెట్టింది. త్వరలో మావాళ్ళను తీసుకొచ్చి, గోడ పగులగొట్టించి, లీ-షీ-చిన్‌ని బయటకులాగితేగాని, దీనికి నా తడాఖా తెలియదు–"

పట్టణానికి వెళ్ళిపోవాలని కాన్ తొందర తొందరగా తన దుప్పట్లు చుట్టుకొన్నాడు. తన విజయవార్తను ఆఫీసులో రిపోర్టు చేయాలని తహతహలాడుతున్నాడు. ఇంతలో సిస్టరు హో మార్కెటునుండి బుట్టతో తిరిగి వచ్చింది. ఎదురుగా దుప్పట్లు చుట్టుకొని నిలబడిన కాన్ వంక ఆశ్చర్యపడుతున్నట్లుచూస్తూ– "ఏమిటీ, అప్పుడే వెళ్ళిపోవటం లేదుకదా! మీకోసం ఇప్పుడే సంబంధం..."

వెంటనే అందుకొన్నాడు కాన్. "గెరిల్లాలతో సంబంధమేనా? ఇప్పుడే దాన్ని పసిగట్టి నిర్ధారణ చేసుకొన్నాను." అంటూ బయటకు వెళ్ళిపోబోయాడు.

ఈ మాటలు పూర్తయినాయోలేదో, ఓల్డుమా, ఇద్దరు గ్రామరక్షకదళ సభ్యులు తుపాకులతో లోపలికి తోసుకువచ్చారు.

"ఎంతధైర్యం? గెరిల్లాలతో చేరతాననంటావానీవు? ఇన్నిరోజులనుండి నీలాంటి అనుమానపు వ్యక్తులకోసమే చూస్తున్నాము. వెంటనే అరెస్టుచేయండివీణ్ణి" అని తన తోటివారికి ఆర్డరిచ్చాడు ఓల్డుమా.

కాన్‌ను పట్టుకోడానికి ఆ యిద్దరు మనుషులు ముందుకొచ్చారు. కాను నెమ్మదిగా—"కమ్యూనిస్టులంటే మీకున్న ద్వేషానికి నిజంగా మిమ్మల్ని అభినందించాల్సిందే. కాని నిజంగానేను......"

వెంటనే సిస్టరు హో— "వీడి బూటకపుమాటలు మీరు వినకండి. గెరిల్లాలలో చేరటానికే వీడు నా యింటికివచ్చాడు. వీడిని వదిలిపెట్టకండి" అంటూ అరవటం మొదలెట్టింది.

ఈ మాటలు వినగానే కాన్ సిస్టరు హో వంక చూస్తూ— "ఓసిముండా! ఇది గెరిల్లాజోను కాదని గుర్తుపెట్టుకో. ఇది మా ఆధీనంలోవుంది. నీ పిచ్చి పిచ్చి వేషాలు ఇక్కడసాగవు—" విషపునవ్వు విసిరాడు కాన్.

నకలీ గ్రామపెద్దగావచ్చిన ఓల్డుమా కానువంక తీక్షణంగాచూసి "నోర్ముయ్యి. తొత్తుకొడకా" అని గర్జించాడు. వీణ్ణి వెంటనే కట్టిపడెయ్యండి అని హెచ్చరించాడు. గ్రామరక్షకదళంవారు కట్టేసేలోపలే కాన్ తన వెనుకజేబునుండి ఒక కాగితంతీసి ఓల్డుమా తనను అపార్థం చేసుకొంటున్నాడేమోననే భావనతో గ్రామపెద్దకు చూపించాడు.

"ఇప్పుడు నేనెవరో మీకు తెలిసివుంటుంది. ఇంకేమైనా అనుమానమా?" అని ఓల్డుమావంక చిరునవ్వునవ్వాడు. కాన్-సుంగ్-చీ కొమింటాంగు గూఢచారిదళంలో చేర్చుకోబడ్డాడని ఇచ్చిన గుర్తింపుకార్డు అది: అది చూడగానే రెచ్చిపోయినట్లు నటించాడు ఓల్డుమా— "అంటే మా గూఢచారి విభాగంలోకి జొరబడిన కమ్యూనిస్టువన్నమాట. నీ గురించి మావద్ద బోలెడంత సాక్ష్యముంది. నిన్ను అరెస్టుచేస్తున్నాం—" అని తన పక్కనున్న రక్షకదళ సభ్యులకు సైగచేశాడు.

కాన్ గజగజ వణుకుతున్నాడు. గ్రామపెద్ద సైగచూడగానే గార్డులిద్దరూ వాడిమీదపడి. కాళ్ళుచేతులు కట్టేశారు.

కానును, గార్డుదుస్తుల్లోవున్న గెరిల్లాలు తీసుకుపోయినతర్వాత, ఓల్డుమా సిస్టరు హో లిద్దరూ కామ్రేడ్ లీ-షి-చినును పరామర్శించటానికి అటకమీదికి వెళ్ళారు— "మేమింకా జాగ్రత్తగావుంటే, ఈ సంఘటన జరగకుండా వుండేది. నీకు అనవసరంగా ఆందోళన కలింగించాం కదా" అని తమ పొరపాటును చెప్పుకొన్నారు

కామ్రేడ్ లీ వారిద్దరిని సాదరంగా పక్కన కూర్చోబెట్టుకొని, జరిగిందంతా విన్నాడు. భవిష్యత్తులో కూడ జాగ్రత్తగావుంటూ, పరిస్థితులకు తగ్గట్టు నడవాలని చెపుతూ—" మహోన్నతమైన పార్టీ, దాని అగ్రభాగాన చైర్మను మావో వుండి మనల్ని నడుపుతున్నంతకాలం, మనచుట్టూ త్యాగాలకు జంకని అశేష ప్రజానీకం వుండగా ఆందోళన పడవల్సిందేముంది? పెద్ద పెద్ద తుఫానులకుగాని, భూకంపాలకుగాని చలించని వుక్కుకోట వీరే. ఏ ఆశయం కోసం వారు ఉక్కుకోటగ నిలిచి పార్టీని, గెరిల్లాలను కాపాడుకొంటున్నారో, ఆ ఆశయాన్ని తుదివరకు పోరాడి సాధిద్దాం"— అంటూ వీడ్కోలు ఇచ్చాడు కామ్రేడ్ లీ.

# అంతర్జాతీయ గీతం

## (The International–Workers Anthem)

మేడేరోజు ప్రపంచమంతటా అంతర్జాతీయగీతం పాడబడుతుంది. ఈ గీతాన్ని యూజీన్‌పొటియర్ అనే కార్మికుడు పారిస్ కమ్యూన్ భావాలకు కానుకగా రాశాడు. ప్రపంచ చరిత్రలో మొట్టమొదటి కార్మికవర్గ ప్రభుత్వం పారిస్ కమ్యూన్.

పొటియర్ 1816 అక్టోబర్ 4న జన్మించాడు. ఆయనగూర్చి లెనిన్ ఇట్లారాశాడు. "పొటియర్ పేదకుటుంబంలోపుట్టి, జీవితమంతా పేదవానిగానే బతికాడు. ప్యాకింగ్ చేసేవాడుగా; తర్వాత వస్త్రాలమీద నమూనాలుగీసేవాడుగా తన జీవనభృతిని కొనసాగిస్తూ శ్రమజీవిగా జీవించాడు. 1840 మొదలుకొని ఫ్రాన్సు ప్రజాజీవితంలోని ప్రతి గొప్ప సంఘటనకు ఆయన స్పందించాడు. తీవ్రమైనగీతాలతో అణగారినజనం చైతన్యాన్ని మేల్కొల్పుతూ, శ్రమజీవులను ఐక్యంకమ్మని పిలుపునిస్తూ బూర్జువాలను, ఫ్రాన్సులోని బూర్జువాప్రభుత్వాలను ఖండిస్తూ తనపాత్ర నిర్వహించాడు".

18 మార్చి 1871న ప్యారిస్ కార్మికవర్గం ఫ్రాన్సులోని అభివృద్ధినిరోధక ప్రభుత్వానికి వ్యతిరేకంగా సాయుధంగా విప్లవించి శ్రామికవర్గ ప్రభుత్వాన్ని నెలకొల్పింది అదే పారిస్ కమ్యూన్. ప్రజలు తమ ప్రతినిధులను నేరుగా (ప్రత్యక్షంగా) ఎన్నుకున్నారు. అత్యధికమైన సంఖ్యాబలంతో పొటియర్ సభ్యుడుగా ఎన్నికయాడు. ఆయన కమ్యూన్ ప్రతి చర్యలోనూ పాత్రవహించాడు. పారిస్ కమ్యూన్ మొట్టమొదట అప్పటివరకున్న సైన్యాన్ని (స్టాండింగ్ ఆర్మీ) రద్దుచేసి ప్రజాసైన్యాన్ని ఏర్పాటు చేసింది, ఈ విప్లవం (Uprising) విజయవంతం కావడానికి మొదటికారణం ప్రజా సైన్య నిర్మాణమే. పారిస్‌లోని కార్మికవర్గంలో అధికసంఖ్యాకులు సాయుధులయారు. ఈ ప్రజాసైన్యాన్నే పాతబూర్జువా ప్రభుత్వం నాశనంచేయాలని ప్రయత్నించింది కమ్యూను కార్మికుల సహకార సంస్థలు స్థాపించింది. పెట్టుబడిదారులు రద్దుచేసిన, మూసేసిన కార్మాగారాలను, వర్క్‌షాపులను, ఈ సహకారసంస్థలు తిరిగి తెరిచి నిర్వహించినవి. అప్పులు ప్రజలు వెంటనే తిరిగి ఇవ్వాల్సిన అవసరంలేదని వాయిదాడిక్రీలు జారీచేసింది. గృహవసతికోసం ప్రజలుచెల్లించిన అద్దెలో కొంతభాగం తిరిగిఇచ్చింది. చర్చిను, ప్రభుత్వాన్ని వేరుచేసి చర్చి ఆస్తినంతా జాతీయ ఆస్తిగామార్చింది. అశేష ప్రజానీకం అవసరాలకు సంబంధించిన ఇలాటి ఎన్నోమార్పులు ఎన్నో అమలుచేసింది. "పారిస్‌లో కమ్యూన్ తెచ్చిన మార్పులు నిజంగా అద్భుతమైనవి" అంటాడు మార్క్స్. (Civil war in France) లో ఈ విషయంరాస్తూ "శ్మశానంలో శవాలులేవు. బంది పోటు రాత్రులులేవు. దోపిడీలులేవు. పారిస్ వీధులు క్షేమంగావున్నాయి. అదికూడా ఎలాటి పోలీసుబలగంలేకుండా" అంటాడు. "Wonderfull indeed, was in change the commune has Brought in Paris; No more corpses at the

morgue; No noctural burglaries, scarcely any Robberies....... the streets of Paris were safe and that without any Police of any kind" కానీ పారిస్ ప్రజలూ, కమ్యూనూ తమ విజయం సుస్థిరంచేసుకోలేకపోయారు అభివృద్ధినిరోధక, విప్లవ ప్రతిఘాతుక శక్తులను నిశ్శేషంగా తుడిచిపెట్టలేకపోయారు. చారిత్రక పరిస్థితులవల్ల కార్మికుల ఉద్యమంలో మార్క్సిజం అప్పటికింకా అగ్రగామిత్వం సాధించలేదు. నూతన రాజ్యాంగయంత్రాన్ని నిర్మించి పాతదాన్ని నిర్ణయాత్మకంగా నాశనంచేయడానికి అవసరమైన నాయకత్వాన్ని ఇవ్వగల అగ్రగామి శ్రామిక వర్గ పార్టీ అప్పటికింకా ఏర్పడలేదు. "Vanguard Proletarian Party did not exist" అభివృద్ధినిరోధకులు తమ సాయుధబలాలను కమ్యూనుకు వ్యతిరేకంగా కేంద్రీకరించారు. పారిస్ ప్రజల వీరోచితమైన ప్రతిఘటన, పోరాటంకూడా శత్రువును ఆపలేకపోయాయి. కమ్యూను అవతరించి రెండునెలలు నిండీనిండకముందే మే 21న పారిస్‌లో శత్రుదళాలు ప్రవేశించాయి. మే 27న 'పెరీలా చైజ్ సిమెట్రీ'అనేచోట కమ్యూనార్డులు (కమ్యూనును రక్షించుకోగోరిన సభ్యులు) అంతిమయుద్ధంచేశారు. వాళ్ల చివరిసారిగానిలిచి, నిలదొక్కుకోడానికి ప్రయత్నించిన ఆ గోడకమ్యూనార్డుల స్మృతిచిహ్నంగా మిగిలింది. కమ్యూన్‌కు, దాని పోరాటయోధులకు జోహార్లు అర్పించడానికి ఈనాటికీ విప్లవ ప్రజానీకం అక్కడికి వస్తుంటారు. కమ్యూను పతనమయాక యూజిన్ పాటియర్ అరెస్టుఅయి చంపబడ్డాడని 30వ మే 1871 రోజు ఒక బూర్జువాపత్రిక రాసింది. కానీ ఈ కవి రహస్యజీవితంలోకి వెళ్ళాడు. అదే సంవత్సరం జూన్‌లో అంతర్జాతీయ గీతం రాశాడు. 1887 లో మరణించేదాకకూడా అతడు శ్రామికవర్గ ప్రయోజనాలకోసం రచనా, పోరాటంసాగించాడు. పాటియర్ మరణించిన 7 నెలలతర్వాత ఫ్రెంచి కార్మికుడూ, పాటలకు స్వరకల్పనచేసేవాడూ అయిన "పియరీడిజైటర్" పాటియర్ గీతాలు మొదటిసారిగా చదివాడు. వాటికి సంగీతంకూర్చే ఉత్తేజం అవి అతనికి కలిగించాయి. 1888లో ఫ్రెంచ్ పట్టణమైన 'లిలీ'లో పత్రికలు అమ్మేవాళ్ళ సమావేశంలో మొదటి సామూహిక ప్రదర్శన ఈ గీతానికి ఇచ్చాడు (Led a Chorus). అప్పటినుండి అంతర్జాతీయగీతం అన్నిభాషల్లోకి అనువదింపబడి 'కార్మికవర్గ అంతర్జాతీయగీతం'గా ఆవిర్భవించింది. వర్గరహిత సమాజాన్ని ఆవిష్కరించే కమ్యూనిస్టు వ్యవస్థ ప్రపంచమంతా ఒకరోజు వెలుస్తుందనీ, నిజంగానే నిఖిలలోకం "నూతన పునాదులపై ఉదయిస్తుంద"ని భవిష్యత్తును ఈ గీతం సరిగానే ఊహించింది. పారిస్‌కమ్యూన్ మొట్టమొదటి ప్రపంచ శ్రామికరాజ్యం. వీరులైన కమ్యూనార్డులగూర్చి మార్క్స్ ఇలా అంటాడు "వాళ్ళు స్వర్గాన్ని వణికించారు" (They stormed heaven). కమ్యూన్ ఓడిపోయినపుడు కూడ మార్క్స్ ఇలా అంటాడు- "కమ్యూన్ సూత్రాలు శాశ్వతమైనవి వాటినెవరూ నాశనంచేయలేరు. కార్మికవర్గం తన విముక్తి సాధించేదాకా యీ సూత్రాలు మళ్ళీ మళ్ళీ ప్రకటింపబడతాయి".

(The principles of the commune are eternal and cannot be destroyed; They will d clare them selves again untill the working class achives its liberation.)

Revolution May—74.

బెంగాలీ ఆధునిక సాహిత్యం :

## కూలుతున్న బురుజులు

అభినవగుప్త

కట్టు కథలను సృష్టించడంలో సాహిత్యప్రచారం మరే ప్రచారానికీ తీసిపోదు. తదనంతరకాలంలో ఈ కట్టుకథలు ఉన్నతస్థాయి విమర్శలోనూ, చారిత్రకరచనల్లోనూ నిలిచిపోగలవుగూడా. 1930 లలో వెలువడిన కొత్త బెంగాలీకవిత్వం టాగూర్‌నూ ఆతని ప్రభావాన్నీ ధిక్కరించిందంటూ ఒక వాడుకవుంది. నిజంగా కొత్తదనాన్ని సంతరించుకున్న కవిత్వం ఇలా చేసివుండవచ్చుగాని. ఆ కవులుమాత్రం టాగూర్ గొప్పతనం ముందు భక్తిశ్రద్ధలతో వినమ్రంగా నిలిచారు. ధిక్కారమనే కట్టుకథను ప్రచారంచేసింది తామేకాబట్టి, ఊహలో ఇలా తమకోరికను సంతృప్తి పరచుకొన్నారనుకోవాలి. ఆ రోజుల్లోని యువకవులనేకులు టాగూర్ తాలూకు దైవతుల్యమైన వివేకమంటేనూ, దోషాతీ తత్వమంటేనూ, అహేతుకమైన గురి ఏర్పరచుకొన్నారని ఆ నాటి ఆధారాలనుబట్టి చెప్పవచ్చు వీరిలో కొందరు నిజంగానే టాగూర్‌కు పెడముఖంపెట్టి, తమ భావాల్లోనూ, భావ వ్యక్తీకరణలోనూ ఆ కవి ప్రాతినిధ్యంవహించే వాటినన్నటినీ నిరాకరించడం జరిగింది. అందుచేత టాగూర్‌పట్ల వారికిగల అపారమైన గౌరవం, చాలా విడ్డూరమనిపిస్తుంది. దాన్ని వివరించడం అసాధ్యం. ఇంకా వారు టాగూర్‌ను పూజించివుంటే. తాము ఏదో నేరంచేసినామనే భావంవల్ల తమ అనిశ్చితవైఖరివల్ల మాత్రమే అలాచేసివుంటారు. తమ తమ రీతులను సమర్థించుకునేందుకు వారు చేయగలిగిందల్లా ఇదే టాగూర్‌ను తోసివేయడం. తోసివేస్తూగూడా ఆ సమయంలోనే ఈ తమ చర్యగురించి తీర్పుచెప్పవలసిందిగా టాగూర్‌నే అర్థించడం పరమ విచిత్రమైన వ్యవహారం.

ఈ అసాధారణమైన ప్రవర్తనగురించి ఒకే ఒక్క వివరణ నా మనసుకు తడుతూ వుంది. తమ పూజా విగ్రహాలను ధ్వంసంచేయాలనే ఉన్మత్తమైన ప్రవృత్తి చల్లబడిన వెన్వెంటనే పశ్చాత్తపంపొందిన పితురీదారులాంటివారు ఈ కొత్త బెంగాలీకవులు. యే జీవితరంగంలోనైనాకానీ, తండ్రి అధికారానికి ఎదురుతిరిగే ప్రతి సందర్భంలోనూ, పితూరీదారుల మనస్సులలో తాము రెండువిధాలా నేరంచేశామనే భావంవల్ల పశ్చాత్తాపం కలుగుతుంది. తాము గతంపట్ల అపచారంచేసామనే భావం వారికి కలుగుతుంది. కాబట్టి వారు ఆ భావాన్ని అణగదొక్కివేసుకునేందుకు భవిష్యత్తుపట్ల అపచరించడానికి పూనుకుంటారు. ఇది మరొక విద్రోహం. దానిమూలంగా తాము నేరంచేసామనేభావం మళ్ళీ కలుగుతుంది. గతంతో రాజీపడేందుకు వారిలో తీవ్రతరమైన కోరిక ఏర్పడుతుంది. 1930 లలోని బెంగాలీకవుల విషయమే తీసుకుంటే, వారి తిరుగుబాటుతాలూకు

ఉన్నతమైన ఆశలూ, ఆశయాలూ ఇలా విద్రోహంపాలై పోవడం ఆ కవులెవ్వరూ తప్పించుకోలేని సాంస్కృతిక విషమసమస్యవల్ల అనివార్యమయింది. వారి తిరుగుబాటుకు మూలప్రేరణ, కొత్త పాశ్చాత్య వాస్తవవాదంతోటి ఆ కవులకు ఏర్పడిన పరిచయంనుంచి, వారి భావనాత్మకమైన తాదాత్మ్యంనుంచి కలిగిందే అందుచేత ఇది తెచ్చిపెట్టుకున్నదే. కాని మౌలికమైనదికాదు. ఒంటరితనంవల్లనో, నాశనపాటువల్లనో కలిగిన భయంనుండి విముక్తిపొందాలనే తహతహలో, కళా, సాహిత్యపరమైన ఈ కొత్త తోరణి నిండివుండేది. సెక్స్‌విషయాలతో, వ్యష్టి, సమిష్టి, క్రూరత్వంతో, ఆశానిరాశలతోకూడిన రాజకీయపోరాటాలతోటి, వ్యక్తిగత సౌఖ్యంతోటి, జీవితం తాలూకు పరమార్థంతోటి, పాశ్చాత్యరచయితలు అధికాధికంగా సతమతమవుతూ వుండేవారు, ఇదంతా పాశ్చాత్య హృదయసంతోషంలో భాగమే. ఈ కొత్తతపన పాతమూసలను పగుల్చుకొని తప్ప వెలికి రాలేకపోయింది, రెండు ప్రపంచయుద్ధాల మధ్యకాలంలో, యూరోపియన్ కళాసాహిత్య ప్రపంచంలో పరంపరగా తరంగప్రాయంగావచ్చిన ప్రయోగాలకు మూలకారణమిదే. ఆనాటి చారిత్రిక వాస్తవాలతోటి ఈ నవ్యప్రకటన తాలూకు రీతులనీ, వస్తువునూ సూటిగా ముడివేయవచ్చు.

తెచ్చిపెట్టుకున్న ప్రేరణ :

1930 ల నాటి యువ బెంగాలీ కవుల విషయంలో మాత్రం అది నిజం కాదు. కొత్త కొత్త ఆకాంక్షలను, రీతులను వారు ప్రవేశపెట్టబూనుకున్నప్పుడు, ఇతరత్రా సంక్రమించిన ప్రేరణ మాత్రమే వారిని కదిపింది. ఆనాడు ప్రబలంగా వుండిన ఒకానొక ఫేషన్‌ను అనుసరించారు. బాగా వాడుకలో ఉన్నదాన్ని అనుకరించారు. పాశ్చాత్య సాహిత్యాన్ని చదువుతుండగా తమకు ఎదురైన భావాలుగానీ, అనుభూతులుగానీ వారికి లేనేలేవని అనను. ప్రతిభావంతమైన కవిత్వశక్తి వారిలో లోపించిందని కూడా అనను. అయితే వారిలో ఏ ఒక్కరూ తమ నవ్యకవిత్వాన్ని భారతీయుల విశిష్ట చారిత్రక పరిస్థితితోటి- తాము అవిరళంగా మాట్లాడుతూ వచ్చిన ప్రజల పోరాటాలతోటి ఆశయాలతోటి- అనుసంధానించలేకపోయారు. శ్రామిక విప్లవం, సామ్రాజ్యవాదం, ప్రజలతో ఏకాత్మకతను పొందవలసిన అవసరం- వీటిగురించి బోలెడంత ప్రసంగం జరిగేదిగాని, జనసామాన్యాన్ని విమోచనకోసం సమీకరించడంగాని, వారితో చేతులు కలపడంగాని, లేశమైనా జరిగేదికాదు. ఎక్కడో బార్సిలోన* భవితవ్యం గురించి ఎంతో హృదయావేదనతో నిరీక్షణతో అనుదినం ఈ కవులు శ్రద్ధచూపేవారు కాని స్వదేశంలోని సామ్రాజ్యవాద వ్యతిరేక పోరాటనేతృత్వాన్ని, గాంధేయ అహింసా

* స్పానిష్ అంతర్యుద్ధంలో ఈ నగరం ఫ్రాంకో కిరాయిమూకలచేత ఘోరహింసలు అనుభవించింది. అను

వాదానికీ, మత మూర్ఖత్వానికీ వదిలివేసారు. అసలు ప్రజలు తరాల తరబడి దోపిడీకీ, అణచివేతకూ లోబడి కొనవూపిరితో మూలుగుతుండేవారు.

ఇలాంటి పరిస్థితులలో ఖచ్చితంగా కళకు సంబంధించిఅయినా, విమోచనగురించి పలికే పలుకులన్నీ పనికిమాలినవే. అవన్నీకూడా అవాస్తవికమైనవే. లైంగిక దాస్య విమోచన సాధించామనుకున్న కవులుకూడా నిజానికి చెల్లని నాణాలే. ఆ కవుల సాంఘిక ఆర్థిక పునాదినిబట్టి అలాంటి విమోచన వట్టి వూహావిషయమే. పగటికలే కాక తప్పలేదు సెక్సు విషయాలతో ఈ కవులకు మొహం మొత్తినట్టు అనిపించినా, ఆ నాటి శృంగార కవిత్వంలో అధికభాగం యుక్తవయస్కులు కానివారి వెర్రి వూహలాగ వుండేది. అయితే ఈ అవాస్తవికత అలాంటి కవులకేగాక ఆనాటి కవులందరికీ సర్వ సాధారణ గుణం. ట్రాట్స్కీ దురవస్థను గురించిగానీ, ఇంటర్నేషనల్ బ్రిగేడ్ ఓటమి గురించిగానీ, సుధీన్‌దత్తా నిజంగానే వ్యాకులత పొందాడా? అతని కవిత్వానికి ప్రధాన వస్తువు మానవుని అస్తిత్వానికి సంబంధించిన పరివేదనగదా? ఎంతో తీరికా సంస్కారమూగల వ్యక్తిగా అతని అభిరుచులతోనూ, ఆదర్శాలతోనూ పొసుగుతుందా? పాశ్చాత్య మనస్తత్వశాస్త్రమూ తన తలనిండా నింపుకొన్న బిష్ణుదే హృదయం శ్రామిక వర్గ రాజ్యాధికారం గురించిన మార్క్సిస్టు స్వప్నాలతోటి ఎలా స్పందించిందో తెలుసుకోవడం పరమ ఆసక్తికరం. తాను పుట్టి పెరిగిన నగరం తాలూకు, పట్టణ పరిసరాల పట్ల ద్వేషం ఒకవైపూ, ఎంతో దూరాన లేని కొండల్లో, లోయల్లో నిరాడంబరంగా ఆదిమ మానవుల్లా నివసించాలనే తహతహ మరొకవైపూ, ఈ రెంటిమధ్య సమర్ సేన్ కావ్యోద్రేకం మారి మారి బయల్పడుతూ వచ్చింది. వక్రమ పద్ధతుల్లో పెరిగి ఉన్నత వర్గాలకు చెందిన నాజూకుతనాన్ని గేలిచేసుకునే "ప్రుఫ్రాక్" (టి.యస్.ఇలియట్ కావ్యం లోని ఒక పాత్ర) పద్ధతినీ, విప్లవంలో వాస్తవంతో పొంతనలేని విశ్వాసాన్నీ మహా తేలిగ్గా కలిపివేయబోయాడు. (బహుశా ఈ వైరుధ్యాన్ని గమనించికాబోలు, అనుభూతి లోతుల్లో మరింత చిత్తశుద్ధితోకూడిన రచనాస్థాయిలో కవిత్వాన్నీ, ప్రచారాన్నీ సమ్మేళన పొందించడంలో వైఫల్యం చెందినందువల్ల కాబోలు, సమర్ సేన్ ఎన్నడో కవిత్వాన్ని వదిలివేసి శుద్ధప్రచారాన్ని చేపట్టాడు.) తాము తెచ్చిపెట్టుకున్న ఈ హృదయానుభూతిని తమ నిజమైన జీవితానికి సంబంధించిన వాస్తవ చారిత్రక పరిస్థితులతోటి సమన్వయింప చేయడంలో ఒకరకంగా వీరంతా వైఫల్యం చెందారు.

రాజీపడాలనే కోరిక ఈ వైఫల్యం ఫలితమే. ఆశపెట్టిన విమోచన పాలిటికి ఈ వైఫల్యం విద్రోహమే. సమీపగతమంటే వరిపడనందుచేత, భవిష్యత్తులోనే ఈకవులకు లంగరందింది. ప్రజలతో కలిసి కట్టుగా ఉన్నప్పుడే తాము సృష్టించగలిగిన ఆ భవిష్యత్తు తాలూకు సూచనలను వాళ్లు రోయించుకుని నిర్లక్ష్యం చేసారుగాని విప్లవానికి సం

బంధించిన వాగ్జాలాన్నిమాత్రం బలంగా నోటబెట్టారు. కొందరికైతే ఈ మాటలంటేనే తగని విడియం. అయితే గతం నుండి ఆమోదముద్ర పొందాలని అందరూ అటుకేసి చూసినవాళ్లే. అందుచేతనే దైవతుల్యమైన టాగూరు వివేకాన్ని ఆమోదంకొరకు ఆశ్రయించవలసి వచ్చింది. తుఫానుకొట్టే అజ్ఞాత సముద్రంమీద దారీతెన్నూ లేకుండా కొట్టుకొని పోకుండేందుకై తాము చెయ్యగలిగిందంతా కలిపి ఇంతే. ఆ రోజుల్లో పురోగామి బెంగలీ త్రైమాసిక 'కవిత' సంపాదకుడుగా ఉండిన బుద్ధదేవ్‌బోస్ ఈ కొత్త కవి గురించో, ఆ కొత్త కవి గురించో, తాను కొత్తగా ప్రకటించిన తన సొంత పుస్తకం గురించో అభిప్రాయం చెప్పమంటూ చీటికీ మాటికీ టాగూరుకు రాయడం ఇప్పుడు ఆలోచిస్తే బాధాకరమనిపిస్తుంది. ఆనాటి ఈ యువ పురోగామి కవికి, జీవిత చరమదశను చేరుకున్న కవికి మధ్య నడచిన ఉత్తర ప్రత్యుత్తరాలు మొత్తంగా "దేశ్" ప్రత్యేక సాహిత్య సంచికలో తిరిగి అచ్చు పడ్డాయి. దాదాపు ప్రతి లేఖలోనూ తన కవిత్వ పత్రికకు ఏదో ఒక రచన పంపమంటూ బుద్ధదేవ్ బోస్ టాగూర్‌ను అర్థిస్తాడు. టాగూర్ కూడా అనేక పర్యాయాలు ఈ అభ్యర్థనలను మన్నించాడు. టాగూర్ తన గతానికి తానే ఎదురుతిరిగి, నవ్యకళా సూత్రాలను వరించాడా ? కావచ్చు. ఆ కాలంలో బోస్ ప్రకటించిన ఆధునిక బెంగాలీ కవిత్వ సంకలనానికి టాగూర్ రచన శ్రీకారం చుట్టింది. పైగా దానిని ఆ పూజనీయుడైన టాగూర్‌కు అంకితమివ్వడంగూడా జరిగింది. మరి ఆ దేవుడు తన వరాలను ప్రసాదించడానికి వెనుకాడలేదు. మార్క్సిస్టులు కానీ, వ్యక్తివాదులుకాని, ఆధునికులందరూ రవీంద్రభక్తులుగా దర్శనమిస్తారు. వీరిలో కొందరు తమ తమ మతాలకు టాగూర్‌ను అధిష్టానదేవతగా నిలుపుకున్నారంటేకూడా ఆశ్చర్యం అక్కరలేదు. అయితే ఈ కొత్త కవుల రచనలగురించి టాగూర్ అభిప్రాయాల మాటేమిటి ? సుధీన్‌దత్తామీదనో, బుద్ధదేవ బోస్‌మీదనో ఆయన మెప్పు కురిపించాడు. వీరితో ఒకలాంటి బాంధవ్యాన్నీకూడా స్థాపించుకున్నాడు. బిష్ణుదే అంటే ఆయన చాలా విముఖత చూపెట్టాడు. ఆ కవి రచనాసరళిపట్ల ఈ వైముఖ్యం తమకు ఏర్పడిందంటాడు కానీ. అతని కవిత్వ వస్తువుగూడా టాగూర్‌కు నచ్చినట్లులేదు. వెనుకటి సాహిత్యాన్ని, ఇంకా అనేక విషయాలను బిష్ణుదే తన కవితలో తరచుగా ప్రస్తావిస్తాడు (అల్యూజన్) కొబట్టి యీ కవితను బోధపరచుకోవడం చాలా ప్రయాసతో కూడుకొన్నపని. టాగూర్ కూడా యీ విషయంలో తన నిస్సహాయతను ప్రకటించి వున్నాడు. సమర్‌సేన్‌ను ప్రశంసిస్తాడుగానీ ఈ కవికి ముఖ్యలక్షణమైన నవీనధోరణిని గానీ, భావుకతనుగానీ స్మరించడు. సుభాస్ ముఖోపాధ్యాయ కావ్యం "పదాతిక్" Padatik) విషయమే ఎత్తుకోడు. అప్పట్లో ఆ కవి గురించి లక్ష్యమే వున్నట్లు లేదు. బుద్ధదేవ్ బోస్‌కు రాసిన ఒక లేఖలో నవ్య కవిత్వ గుణ నిర్ణేతగా తన పరిమితులను

టాగూర్ తానే వొప్పుకుంటాడు. సమకాలికమైన తన తీర్పును భవిష్యత్‌కాలం తోసి వేసే ప్రమాదంనుంచి జాగ్రత్తగా తప్పుకోవడమే యిది. ఇంతకంటే మహాతెలివిగా ఆయన వ్యవహరించి వుండడు: ఎందుకంటే, ఇటీవలికాలంలో అటు బిష్ణుదే, ఇటు సుభాస్ ముఖోపాధ్యాయ, ఇద్దరూనూ తమ కవిత్వానికి దేశంలోగల అత్యున్నతమైన బహుమతులు పొందారు.

## "సంపన్న కుటుంబంలో పుట్టుక" (Aristocratic Origin)

చారిత్రిక దృక్పథంఅనబడే ఒక విమర్శారీతిదృష్ట్యా తన కవిత్వాన్ని అనామధేయులైన విమర్శకులు కొందరు విమర్శించ సాహసించినందుకు బుద్ధదేవబోస్‌కు రాసిన ఒక సుదీర్ఘమైనలేఖలో టాగూర్ కయ్యానికిదిగుతాడు. బ్రిటిష్ పెట్టుబడిదారీ విధానం పెంచిపోషించిన భూస్వామిక సంపన్న వంశఫలమేనని ఇంకా తనగురించి వాదించేవారిపై ఈ జాబులో టాగూర్ ఎదురుదెబ్బతీస్తాడు. బాల్యంలో సూర్యోదయ సమయంలో కొబ్బరిమట్టలపై తళతళలాడే కాంతిక్రీడగురించిగాని, యుక్తవయస్సు వచ్చాక పద్మానది దృశ్యాలగురించికాని తాను ఆనంద పారవశ్యంచెందాడంటే తాను సంపన్నవంశంలో జన్మించడంగాని, బ్రిటిష్‌వారి ఆలనకూ పాలనకూ లోబడివుండడం గాని దానికి కారణంకాదని ఈ లేఖలో టాగూర్ జటిలమైనవాదాన్నిబట్టి తేల్చుకోవచ్చు. కవిమాత్రిమే ఆలాంటి ఆనందాన్ని అనుభవించి తన రచనలద్వారా పాఠకులకు అందించగలడు అని టాగూర్ భావమైవుండవచ్చు. అయితే ఇలాంటి తేలికైన ఆనందాలు గాని, వాటి బట్వాడాగాని మహాకవిత్వవస్తువు కావడంజరుగదు. ప్రకృతి కవిత్వ తాలూకు అతిసాధారణ స్థాయిలోకూడా, ఇలాంటి ఆనందాలను అనుభవించే క్రమంలో కొన్నికొన్నిఘట్టాలవద్ద, ఇంద్రియగోచరమైన విషయాలను సుఖలోలుడై స్వానుభూతికి తెచ్చుకొని పరవశంపొందే కవిని గాఢతరమైన అలోచనలువచ్చిపడి అతని స్వీయానందాన్ని చెదరగొట్టి తీరుతాయి. ప్రకృతి నిర్దాక్షిణ్యత, మానవసౌఖ్యంపట్ల దాని నిర్లక్ష్యం, మానవుని అనివార్యమైన ఒంటరిపాటు, మృత్యుభీతి, అసంఖ్యాకమైన సాంఘిక అన్యాయాలు, చెడుగుబ్బా, కవిసౌందర్య దర్శనానికి ప్రగాఢత్వానీ సంపన్నతనూ సమకూర్చుతాయి. మానవుడు అనంతంగా స్వప్నించే అపరిమిత ఆనందం స్వాతంత్ర్యం-

ఆనందానికీ, సౌందర్యానికీ భిన్నమైన భయాన్నీ, వికారాన్నీ, చూపెట్టే దృశ్యాలు టాగూర్ కవితలో, కనీసం అందులో ఎక్కువభాగానికి సంబంధించినంతవరకు లోపించాయి. కాబట్టే ఆయన కవిత్వానికి ప్రగాఢత్వమూ, సంపన్నత్వమూ కొరవడ్డాయి. తన సౌందర్యానుభూతికి అడ్డుతగిలి దాన్ని చెదరగొట్టగల సకలభావ ముద్రలనుండి తప్పుకొని, తన వొంటిస్తంభపుమేడలో ఆయన వుండిపోయాడనుకోవాలి. టాగూర్ సౌందర్య తృష్ణతాలూకు ఈ నిర్దిష్టలక్షణం అతని సృజనాత్మకతను వ్యర్థంచేసింది.

ఆయన భూస్వామిక సంపన్నకుటుంబంలో జన్మించడంగాక, తన వర్గానికిగల అభివృద్ధినిరోధకమైన ప్రయోజనాలకు తాను విధేయుడిగావుండి పోవడమే దీనికిమూలం. బ్రిటిష్ పరిపాలన తనవర్గానికి ప్రసాదించిన వరాలబలంతో ఈ వికారాన్నీ, భయాన్నీ సృష్టించింది ఆ వర్గమే. సంపన్నవంశంలో జన్మించడమో బ్రిటిష్ పరిపాలకులకు ఇష్టపూర్తిగా తాబేదారీచేయడమో, ఈ రెండూ టాగూర్ కవిత్వం గొప్పది అయ్యేందుకుగాక. నీరసం అనార్థంకావడానికే తోడ్పడ్డాయి. అణగారిన, వికలమైన అశేష మానవకోటిపై ఎక్కి, తొక్కి, దోచి. మేసే కొద్దిపాటి సంపన్నవర్గం ఎప్పుడూ నిజమైన సంస్కృతిగాని నాగరికతగాని వికసిల్లేందుకూ. వర్థిల్లేందుకూ తోడ్పడదు. దేశం వెలుపలి మూలస్థానాలనుండి సంక్రమించే సంస్కృతిని అది అనుకరించగలుగుతుంది. పాతకాలపు భూస్వామిక, రాజరికాలకింద సామాన్యప్రజలు అనుభవించిన పేదరికం కంటె బ్రిటిష్‌పాలనలో మరింత పేదరికాన్ని అనుభవించారు; మరి ఈ ప్రజలను దోచుకొనే సంపన్నవర్గం భోగభాగ్యాలనుభవించింది. భారతదేశంలో బ్రిటిషువారి పెట్టుబడులమూలంగా సాగిన దోపిడీవల్ల ఈ వర్గం పరాన్నజీవిగా వృద్ధికివచ్చింది. ఇలాంటి క్షీణమానమైన నకిలీపాలకవర్గం ఏదీ స్వతంత్రమైన సంస్కృతిని సృష్టించజాలదు. కాబట్టి టాగూర్ సౌందర్యదర్శనం మహాఅయితే, వాస్తవంనుండి పలాయనంమాత్రమే కాగలదు; కాకపోతే ఈ వర్గ వాస్తవానికి ఒక సమర్థనో, ఆచ్ఛాదనో అవుతుంది. టాగూర్ పుట్టిపెరిగిన వర్గానికిగల పరాశ్రయత, చరిత్రలో దానికిపూర్తిగా లోపించిన ప్రాముఖ్యత, ఇవి ఆయన రచనలను ప్రజలకు అనావశ్యకం చేస్తాయి. చరిత్రలో ఒకానొక క్లిష్టసమయంలో మానవజాతి చారిత్రక భవితవ్యాన్ని నిర్ణయించి నడుపగల ఏ నిజమైన సంపన్నవర్గానికి తానుచెందలేదు. స్వదేశంలో బ్రిటిషుపెట్టుబడిదారీ విధానం పెంపొందడానికిమాత్రమే తోడ్పడిన నిరర్థకమైన "అనావశ్యకమైన" వర్గం టాగూర్‌ది. చరిత్రలో తాము వొట్టి భూభారానికిమాత్రమే పనికిరాగలమని గుర్తించి, సాఫల్యంకోసం మరొక తెన్నున సాగివుండినట్లయితే, టాగూర్‌గాని, ఆయన వారసులుగాని తమ సృజనాత్మక శక్తికి గొళ్ళాలను తీసివేయగలిగి వుండేవారు.

ఈ వర్గం తాలూకు పరమ అనావశ్యకత, వారి అరువు సంస్కృతి, 1920 లలోను, 30 లలోను మరింత ప్రస్ఫుటమైంది. ఐనప్పటికీ సంస్కృతీ పరులైన అల్పసంఖ్యాకులలో మాత్రం ఈ పరిస్థితి గురించి గుర్తింపు బహుకొద్ది "దేశ్"(సాహిత్య సంచిక-1974)లో వెలువడిన కొన్ని కొన్ని గతస్మృతులమూలంగా "సాబుజ్" "పథ్" (SABUJ, PAT) 'పరిచయ' వర్గాలగురించి మనకు తెలిసిన కొద్దిపాటి విషయాలనుబట్టి కేంబ్రిడ్జ్, ఆక్స్‌ఫర్డ్ విశ్వవిద్యాలయాలలో చదివివచ్చిన మన మేధావుల నిష్ప్రయోజకత్వం మనకు బోధపడుతుంది. ఆ మేధావులకు మాత్రం అందుగురించి ఏకొద్దిస్పృహ అయినాలేదు. తమ స్వదేశీయుల బాధలకూ, పోరాటాలకూ వారు బధిరాంధప్రాయులయ్యారు. క్షీణాభిరుచులు కలిగిన తమ సంకుచిత కళాప్రియత్వం మరెక్కడా కనిపిన

సంతతి యధేచ్ఛతోటి అనుసరించిపోయారు. మరింత ప్రజారంజకత్వాన్ని సమకూర్చుకొన్న సాహిత్య రచనలలోను, మరింత తక్కువ విద్యాసంపత్తిగల రచయితలలోనూ కఠోరమైన జీవిత వాస్తవాలను గురించిన స్పృహ మనకు కనిపిస్తుంది. అయితే ఇక్కడకూడా మధ్యతరగతికి సహజమైన కట్టుకథ వ్యవహారం ఈ స్పృహను ప్రభావితంచేసి పలచబడేట్టు చేస్తుంది.

'47 ముందునాళ్ళ సంస్కృతిగురించి నేను చెప్పింది '47 తార్వాతకాలపు సంస్కృతికికూడా అనువర్తిస్తుంది ప్రజల్లో అత్యధిక భాగం అథఃపాతాళంలో పడివుండగా, మహా ధనసంపన్నమైన వర్గంలో చాలా కొద్దిభాగం పరాన్న భుక్కు సాంస్కృతిని పెంపొందిస్తూవుంది. పాశ్చాత్యదేశాల దోపిడి ఒక నకిలీ సంపన్న సంస్కృతిని సృష్టించిన వెనుకబడిన దేశాలన్నింటిలోను, నేడున్న పరిస్థితి మన మనస్సుల్లో ఒక ప్రశ్ననూ, దానికి సమాధానాన్నీ అపేక్షించక తప్పదు. ఈ కొత్త సంస్కృతిని దాని విలువలను ఒక జయప్రదమైన ప్రజావిప్లవం ఈ దేశాలలో నాశనం చేయబోతుందా ? పాశ్చాత్య దేశాలలో ఇలాంటి విప్లవమే సంభవిస్తే, పరిశ్రమాభ్యుదయం సుదీర్ఘంగానూ, సంపూర్ణంగానూ అభివృద్ధిచెందిన తదనంతరం ఆ విప్లవం సంభవించేట్లయితే ఈ అభివృద్ధిక్రమంలోకి జనసామాన్యాన్ని తెచ్చి నిలుపక తప్పదు; ఈ ప్రగతితోపాటు ఏర్పడే సాంస్కృతిక సంప్రదాయంలో జనసామాన్యం పాల్గొనకా తప్పదు. దానిని సృష్టించి తిరిగి ప్రాణం పోయకా తప్పదు. తూర్పుదేశాలలో అలాకాదు. దోపిడీతోపాటు, వెనుకబడినతనంతోపాటు ఇతరులనుండి సంక్రమించిన సంస్కృతిని తోసివేయడంతోనే ఏ ప్రజావిప్లవమైనా ప్రారంభంకావాలి. విప్లవ ప్రారంభకాలంలోనూ విప్లవానంతరకాలంలోనూకూడా, జనసామాన్యాన్ని విద్యావంతమూ, నాగరికమూచేసే పోరాటాగ్నిజ్వాలల్లో పాత, సంపన్నవర్గ సంస్కృతి భస్మీపటలం కావలసిందే. నిజంగా ప్రజాపరమైన ఈ సంస్కృతి ప్రారంభదశలో, పాత నకిలీ సంపన్నవర్గపు దంబాలకు తగిన ప్రత్యామ్నాయం కాదనిపించవచ్చు. విప్లవానంతరకాలంలో శ్రామికవర్గ సాంస్కృతిక జీవితం విప్లవం ముందురోజులనాటి అల్పసంఖ్యాకవర్గపు సంస్కృతితో ఇందువల్లనే సరితూగలేదు. అయితే గతకాలం పాతబడిన తన విలువలచట్రంలో సాఫల్యాన్ని పొందలేకపోయింది, నిర్వీర్యంవల్ల కృశించి నశించవలసివచ్చింది. కాని ఈ కొత్త సంస్కృతి మాత్రం అలాకాదు. దీనికి మరింత విస్తృతిమైన ప్రాతిపదిక వుండడమేకాక మరింత సార్వజనీనతకూడా సుసాధ్యమవుతుంది. అందుచేత యిది కొత్త కొత్త శిఖరాలను అందుకోగలదు. ఏ దేశంలోనైనా ప్రజాసాంస్కృతిక విప్లవాలకన్నిటికీ ఇది వర్తించి తీరుతుంది.

[ఫ్రాంటియర్ జూన్ 15, 1974]

పుస్తక సమీక్ష :

# "నీ బతుకే కవిత్వానిజం!"

రమణారెడ్డి

వెంపటాపు సత్యం కవి అంటే ససేమిరా ఒప్పుకోని "శిష్టులు" సుబ్బారావు పాణిగ్రాహిని మెల్లకంటితోనైనా కవిగా చూడగలరు. రెంజిమ్‌నీ శివుణ్ణీ నసుగుతూనైనా కవులుగా అంగీకరించగలరు. అయితే తరతమ భేదాలతో ఒక్కపనే చేశారు ఆ నలుగురూ; సాహిత్యాన్నీ రాజకీయాన్నీ పెనబడేలా మెలిపారు. విప్లవకవులకు వీరిదే వరవడి.

కావచ్చుగాని విప్లవకవులందరూ ఒకేవిధంగా ఒకేస్థాయిలో ఆ వరవడిని అనుసరించలేదు. కవిత్వరూపాన్నే తీసుకునేట్టయితే, వచనగేయరూపం జనసామాన్యానికి సూటిగానూ సులువుగానూ కవిత్వసందేశాన్ని అందించలేదని తెలిసికూడా దాన్నే ఆశ్రయిస్తున్నవాళ్ల సంఖ్యలో ఎక్కువ. మిగిలినవారిలోనైనా బహుకొద్దిమందిమాత్రమే జానపదబాణీలలో మాండలికభాషతో కవిత్వాన్ని రాయడమేగాక, తాము రాసిందాన్ని తామే పాడి, బాగాకూడాపాడి జనాన్ని కదిలించగలుగుతున్నారు. అలా వి.ర.సం. ఆశయానికి చాలావరకు న్యాయం చెయ్యగలుగుతున్నారు. వీరిలో గద్దర్ తర్వాత వంగపండు ప్రసాదరావునే పేర్కొనాలి. ప్రసాదరావుగేయాలను వి.ర.సం. విశాఖయూనిట్ "ఏరువాక" పేరుతో ప్రకటించి, విప్లవకవులకు తమ కర్తవ్యంగురించి బలంగా హెచ్చరిక చేసింది.

మాండలికభాషలో రాసినందువల్లమాత్రమే ప్రసాదరావు గేయాలకు బలం రాలేదు. అలా రాసినందువల్ల వాటికివచ్చిందల్లా సహజత్వమే. నగిషీలుచెక్కి నాణ్యాల కోసం ప్రయత్నించకుండా ప్రజలనోటినుంచే ఊడిపడ్డట్టుగా ప్రసాదరావు తన గేయాలకు జనంమాటతీరును పట్టించాడు. ఆ జనమే కూడబలుక్కుంటున్నారు. కట్టుగడుతున్నారు. ఆరాటపడి పోరాటాలుచేస్తున్నారు. వారికీ పాఠకులకూ మధ్య కవి 'తడికరాయబారం'చెయ్యడంలేదు. ఆ జనంలో తాను లీనమౌతున్నాడు మేల్కొన్నవారిలో తానూ ఒకడైనట్లుగా. వారినే మాట్లాడుకోనిస్తున్నాడు. వారి చైతన్యస్థాయికంటే అతనిది ఈ కావ్యాలలో భిన్నమైనదికాదు, అధికమైనదీకాదు. పోరాటకారులుగా ఆ జనానికిగల గుణాలూ గుణలోపాలూ కవిలో కవిత్వంద్వారా ప్రతిబింబిస్తున్నాయి. కాబట్టి ఆజనం తాలూకు జీవిత వాస్తవమేదో అదే "ఏరువాక"గేయాల నిజమైనబలం. ప్రసాదరావు మాటల్లో. జరుగుబాటుకోసం తిరగబడుతూన్న పేదవారి పోరాటచైతన్యమే ఈగేయాల్లో అలసాగుతుంది.

శ్రీకాకుళ సత్యం యావద్భారత సత్యమే- అదేమిటంటే. భూస్వామ్యానికి, దాన్ని చావనివ్వకుండా పెంచి కొమ్ముగాస్తున్న బడాబూర్జువా, వర్గాధిపత్యానికీ వ్యతిరేకంగా రైతులూ కూలీలూ ఇతర పీడితవర్గాలూ కలిసి జనతా ప్రజాస్వామిక విప్లవాన్ని ప్రారంభించారు. ఇది కొద్దిప్రాంతాలలో కొద్దిమందిమాత్రమే ప్రారంభించిన ఉద్యమం అనిపించవచ్చు. వట్టి పితూరీయే లెమ్మనిపించవచ్చుగాని. ఎంతచిన్న ప్రమాణంలో ఉన్నా ఎన్ని ఆటుపోట్లకుగురైనా. నేటి ప్రజాజీవితంలో ఇదొక్కటే అర్థవంతమైన విషయం. 1968 నుండి దేశచరిత్రలో మలుపు మొదలైంది. ఇప్పటికిది స్వల్పమైనా, ముందు ముందు ఇదే బలీయమౌతుంది. సకాలంలో ఈ మార్పునుగుర్తించి ఆహ్వానించడమేగాక. దాన్ని పటుతరమూ శీఘ్రతరమూచేసే సాంస్కృతికశక్తిగా విప్లవ సాహిత్యం రూపొందుతూంది. విప్లవ సాహిత్యాన్ని సృష్టించగల రచయితల సంస్థే విరసం. ఆపనిచెయ్యనప్పుడు ఆది ఉండీ ఊడీ ఒక్కటే.

వంగపండు ప్రసాదరావు వ్యక్తిత్వంమీదనూ కవిత్వంమీదనూ శ్రీకాకుళ సత్యం ముద్ర బలంగావుంది. తాను పుట్టిపెరిగినసీమ ఆంధ్రదేశంలో వ్యావసాయిక విప్లవానికి పుట్టిల్లయింది. తానెరిగిన సాదా పేద జనాలు మెట్టుమెట్టుగా సాయుధ పోరాటదశకువచ్చి చేరుకున్నారు. "ప్రయాణం"అనే గొప్పగేయంలో ప్రసాదరావే అన్నట్టు, సిలకలు కత్తులు దులపరించాయి. సెంవరపిల్లులు శంఖాలూదాయి, మిడతలు బడితెలు పట్టాయి, తూరీగలు తుపాకిపేల్చాయి. వర్గపోరాటంలో ఇది అత్యున్నతమైన స్థాయి. కోర్టుల మీద, శాసనాలమీద నమ్మకంచచ్చిన జనం, సత్తెమన్న, రెడ్డిసిన్న, కైలాసం, పంచాది దంపతులు, భాస్కరుడు, సంగమేసులాంటి వాళ్ళెత్తిపట్టిన ఎర్రజెండాకిందికి వచ్చి చేరారు-

మన్యం దొరలంతా
ఎర్రసేన లయ్యారు।
భూసామి ధనవంతుల-
మాసకోత కోసారు।
ఎదురొచ్చిన పోలీసుల-
కెదురుగ నిలబడ్డారు।

అది నేటికి గతమే కావచ్చు. వారు నిన్న అవలంబించిన పోరాటరూపం ఏకైకపోరాటరూపం కాకపోవచ్చు. అయినా దాన్ని నిర్ణయించాల్సింది పోరాడేజనమే. నిజజీవితంలోలాగే ఈ పాటలలోకూడా ఆ జనం తమ శత్రువుల విషయంలో దయాదాక్షిణ్యాలు చూపలేదంటే, ఆ శత్రువుల వర్గదోపిడీ 'సంచితమే' దానికి కారణం.

ఆ దోపిడీ అమానుషరూపం ధరించింది. జనరక్తం మరిగింది. జనంతాలూకు కాయకష్టాన్ని సొమ్ము చేసుకుంది. పంటను పండించినవారికి వస్తులనే మిగిల్చింది. బుగతను భూతంగా మార్చింది. ఊరి యజమానిని ఊరబందిగా బలిపించింది. జనం గొంతుక్కు ఉరితాడుగా బిగించింది సమితులూ, డెవలప్మెంటుబోర్డులూ, చివరకు కోర్టులూ దానికే అనుకూలించాయి పోలీసులూ సిపాయిలూ దానికొమ్మేకాచారు. ప్రజాతంత్రం"లో ప్రజ లోపించి తంత్రమే మిగిలింది. ఓట్లు అధికారానికి దోప్లే అయ్యాయి.

ఈ ఎదిరులేని ఎజమానోయీ! (ఓర్నాయనా)
మన కష్టం తింతండ్రా నీ ..
డబ్బున్నా దయనేనోలూ ..
మన రక్తం తాగుతండ్రనీ ..
వూరులోని కూలిరైతులూ ..
పాకలేని పాలికాపులూ ..
వస్తులున్న పేదరైతులూ ..

కలిసి మెలిసి సంఘం పెట్టుకున్నారు. ఇది అత్యంత ప్రాథమికమైన వర్గచైతన్యరూపం. రైతు కూలి సంఘం కష్టజీవులు పండించిన పంటను వారికి దక్కించేందుకే ప్రయత్నించింది. కాని బుగతలు వూరుకుంటారా? మున్సబు కరణాలు వారి బంట్లు, తాసీల్దార్లు వారి తాబేదార్లు. పోలీసులు వారి పనిముట్లు. గవర్నమెంటే వారి ఉంపుడుగత్తె. ఫలితం? రక్తం చేసిన రాజ్యం! దౌర్జన్యమంటే ఇదే దౌర్జన్యం. హింసంటే ఇదే హింస. వ్యవస్థను మార్చడానికీ పరిమార్చడానికీ జనంచేసే బలప్రయోగం దౌర్జన్యంకాదు, విప్లవ కార్యాచరణే అవుతుంది.

నెత్తురు విచ్చిన మనము
నెత్తురు నూడాలీ ॥సందామామా॥
బతుకులు పెట్టిన మనము
బతుకుట నూడాలీ ॥సందామామా॥

చెట్టెక్కి బుసగొడుతూ వస్తూన్న పాముని రామచిలక ముక్కు మొనతో గుచ్చివెయ్యడం న్యాయమే. ప్రసాదరావు గేయాలలోని మనుషులకూ తమ శత్రువులెవరో తెలుసు. ఆ శత్రువుల భరతం పట్టడానికి ప్రతి గేయంలోనూ వాళ్లు సంకల్పించుకొన్నట్టు కవి రాశాడంటే, వారి మనస్సులకు తాను అద్దంపట్టాడనే అర్థం. ధర్మాధర్మాల ప్రస్తావనకుగానీ నీత్యవినీతుల ప్రస్తావనకుగానీ హింసాహింసల ప్రస్తావనకుగానీ సంబంధించిన విషయం కాదిది. యుక్తాయుక్తాల ప్రస్తావనవస్తే అది సిద్ధాంతవేత్తలకూ, ఉద్యమనాయకులకూ రావలసిందేగాని, తరతరాల రక్కసి దోపిడీకిగురై కటిక పేదరికానికి ఎరైన జనసామాన్యానికిరాదు, రావలసిన పనిలేదు. అయితే తమ చర్యలఫలితంగా రాజ్యశక్తి సాగించగల అణచివేతకు తాము గురిగాక తప్పదంటే, తప్పకపోవచ్చుగాని తమ వర్గకసి

మాత్రం వారిని మళ్ళీ మళ్ళీ ఆ పంథాకే మళ్ళిస్తుంది, తమ బతుకే తమకు పోరాట పాఠశాల, తమ బతుకే కమ్యూనిజం.

అవసరమైతే మనమూ
ప్రాణాల్ని యియ్యాలి–
తియ్యాలి!

పోరాటచైతన్యస్థాయినిబట్టే పోరాటరూపాలు నిర్ణయమౌతాయి. ఆ పరిస్థితిలో ఆప్రజలు యథార్థంగానే ఆచరించినవాటికి కవితారూపం ఇవ్వడమే కవి చేయవలసింది. ప్రసాద రావు చేసిందీ అదే ఫలితాలను బేరీజువేసుకోవడం ఉద్యమనాయకుల పని.

"అభాగ్యజీవుల భాగ్యయుగం"ఆదర్శంగా భారతీయ రైతాంగం కార్మికవర్గనాయ కత్వాన కొనసాగిస్తూన్న జనతా ప్రజాస్వామిక విప్లవ పోరాటానికి వి.ర.సం. చెయ్యగ లిగినంత సాయంచేస్తూ ఉందా? విప్లవ సాహిత్య సృజన ఆశించినంత విండుగాగానీ బలంగాగానీ జరగడంలేదు. వి.ర.సం. రచయితలకు, "విప్లవ"విశేషణం వట్టి భూష ణంకాకుండా సార్థకం కావలెనంటే, అనేకులలో ఇంకా మిగిలివున్న పెటీబూర్జువావ్యక్తి వాద విషానికి, విప్లవ పోరాటకారునికి ఉండవలసిన అణకువ, ప్రజలనుంచి నేర్చుకోవా లనే ధ్యాస, తీర్మానాల్లోనేగాక ఆచరణలో ప్రజలమధ్యకు సాహిత్యాన్ని తీసుకుపోవాలనే దీక్ష, విరుగుడుగా పనిచెయ్యగలవు. పేరు ప్రఖ్యాతులున్న అనేకులకంటె వంగపండు ప్రసాదరావు చాలా మెరుగు.

---



---

**పౌరశాస్త్రము భారత గణతంత్ర అధ్యక్షుని బాధ్యతలు**

1) ప్రజాకోర్టు నిర్ణయాన్ని పాటించి భూస్వాముల్ని ఖతంచేసిన పేదరైతులకు బూర్జువా కోర్టులు వేసిన మరణశిక్షను ఖాయం చేయటం.
2) పార్లమెంటు లేనప్పుడు, నడుస్తున్నపుడూ ప్రజా వ్యతిరేక ఆర్డినెన్సులపై చేవ్రాలు చేయడం.
3) సినిమా తారల క్రికెటుకు, క్రికెటు తారల ఐదు రోజుల ఆటకు ప్రారంభో త్సవం చేయడం.
4) 58 కోట్ల ప్రజలలో ప్రథమ పౌరుడు ప్రధాని చేతిలో రబ్బరు స్టాంపు అయి ఆదర్శాన్ని సృష్టించడం.

# విప్లవ సాంస్కృతిక వేదిక

శ్యామ్‌కుమార్

అది వరంగల్‌కు కాజీపేట్‌కు మధ్యనవున్నగ్రామం- గ్రామమంటే కుగ్రామ మేమీకాదు. ఒక మోస్తారుగచూస్తే పెద్దగ్రామమే అది. ఆ గ్రామంలో సుమారు ౫, ౬ వేల జనాభావుండొచ్చు ఆ గ్రామంలో దోపిడికి సంకేతంలా అక్కడక్కడ 'మిద్దెలు' 'భవనాలు'వున్నాయి. దోచుకోబడ్డాము అనేదానికి సంకేతంలా విపరీతమైన పూరిండ్లు, పూరిగుడిశెలు వున్నాయి. ప్రస్తుత ధరలకు కొనుగోలుశక్తిచాలక, జీతంరాళ్ళు పెరగక, సంసార సముద్రాన్ని ఈదడానికి గుండెను రాయిచేసుకొని దినం ఒక 'గండం'లా భావించి జీవితాన్ని నెట్టుకొస్తున్న మధ్యతరగతి కుటుంబాలు కొన్నిఉన్నాయి ఆ గ్రామంలో.

అసలుమేము వరంగల్‌లో సాంస్కృతిక ప్రదర్శన ఇవ్వడానికని హైద్రాబాద్ నుండి బయలుదేరేముందు పైగ్రామ విద్యార్థులు, యువకులు, భారత కమ్యూనిస్టుపార్టీ (మా.లె.) సానుభూతిపరులుకలిసి మాకోఉత్తరం వ్రాసారు.

మీరు ఎలాగైన వరంగల్‌లో సాంస్కృతిక ప్రదర్శన ఇవ్వడానికి వస్తున్నారు కదా! వరంగల్‌కు మార్గమధ్యంలోగల మా గ్రామంలో మీ సాంస్కృతిక ప్రదర్శన కావాలని స్థానికప్రజలు, యువకులు, విద్యార్థులు కోరుతున్నారు. కాబట్టి మీరు ఒక రోజుముందు బయలుదేరి మా గ్రామ బీదప్రజల కోరిక నెరవేర్చడానికి మా గ్రామంలో సాంస్కృతిక ప్రదర్శన ఇవ్వగలరని ఆశిస్తున్నాం. ఇది పై గ్రామంనుండి వచ్చిన ఉత్తరంయొక్క సారాంశం.

పై ఉత్తరాన్ని మా సంస్థ పరిశీలించి సాంస్కృతిక ప్రదర్శనకు ఒప్పుకుంది. విప్లవాలయుగంలో సాంస్కృతిక విప్లవసైనికులుగ సామ్రాజ్యవాద, ఫ్యూడల్ వ్యతిరేక సాంస్కృతిక మహోద్యమంలో భాగంగపనిజేస్తున్న మాసంస్థ ప్రజలు ఆహ్వానిస్తే ప్రజలవద్దకు వెళ్ళకుంటే ఎవరివద్దకెళ్తుంది?

కాజీపేట్‌లో రైలుదిగి, అక్కడే బస్సెక్కి మేము వెళ్ళాల్సిన గ్రామానికి దగ్గరగవున్న స్టేజీవద్ద దిగాము.

బస్ స్టేజీనుండి గ్రామానికి రెండు కిలోమీటర్లుఉంటది. స్టేజీనుండి గ్రామానికి వెళ్తుంటే మా దళం ఒక సాంస్కృతిక సైన్యంలోనిదళంలా కదిలిపోతూంది. ఒకరి చేతిలో డోలక్, మరొకరిచేతిలో మేకప్‌బాక్సు, ఇద్దరుకలసి హార్మోనియంపట్టుకున్నారు ఇంకొకరు బుర్రకథ బుర్రలుపట్టుకున్నారు. వేరేవారు తంబురపట్టుకున్నారు, ఇవిగాక ఎవరెవరి బట్టలబ్యాగ్‌లు వాళ్ళేపట్టుకొనివెళ్తుంటే 'మార్చ్'చేస్తున్నట్టు అనిపించింది.

అప్పుడునాకు ఒకపుస్తకంలో చదివిన సంఘటన జ్ఞాపకమొచ్చింది. చైనాలో ఎర్రసైన్యం ఒక 'టౌన్'లో విశ్రమించి తర్వాత వేరేస్థలానికి వెళ్ళేటప్పుడు ఎర్రసైన్యపువీరులు ఉత్సాహంగ, ధైర్యంతో, ఖుషీగ వెంబడి పెంపుడుకోళులను, పావురాలను, చిలకలను, చిన్నచిన్న కుక్కపిల్లలను తీసుకపోతుంటే స్థానికప్రజలు తమ ప్రియతమ ఎర్రసైన్యానికి ఆనందంగ వీడ్కోలు ఇచ్చినట్టు-

ఇక్కడకూడ మమ్ములనుచూచిన కొంతమంది ప్రజలు విచిత్రంగచూస్తు పోయేవాళ్ళు ఆగిపోయారు. మేము వాళ్ళతో "రాత్రికి బుర్రకథవుంది రండి" అన్నాము. వాళ్ళు ముసిముసిగ నవ్వుతు తలలూపారు

రాత్రి ఎనిమిదయింది. మేకప్‌రూములో ముందు Item ఉన్నవాళ్ళు మేకప్ చేసుకుంటున్నారు. మిగలావాళ్లస్థానికవాలంటీర్లకు సహాయంచేస్తున్నారు. స్టేజ్ తయారీలో, చిన్నపిల్లల అల్లరిని అదుపులోపెట్టనీకి చేదోడుగఉన్నారు. అప్పటికీజనం నిండిపోయింది. సభాస్థలంలో- క్రిక్కిరిసినట్టు ఆడ, మగ- చిన్నపెద్ద అందరూ వచ్చారు.

రాత్రి తొమ్మిదయింది. ఇంక కొంతమంది కష్టజీవులు, కూలీలు పొలంపనుల నుండి వచ్చారు.

మొదట నాటిక ప్రదర్శించాము- "ఒక గెరిల్లాదళం అడవిలో రక్షణతీసుకుంటుంటే, పోలీసువాళ్ళు గెరిల్లాదళంతో తలపడతం, అందులో గెరిల్లాల నాయకుడు తీవ్రంగ గాయపడి, చనిపోవడం. దళసభ్యులకు పగ్గకసి పెచ్చిపోవడం- ప్రతీకారానికి కసితో ప్రతిజ్ఞపూనడం- అందుకొరకు దళంకదలిపోవడం"ఇది నాటికలోని సారాంశం.

మొత్తంమీద గెరిల్లాలను చూడని ప్రజలకు స్టేజీపై గెరిల్లాలను చూసేసరికి రక్తంలో సంచలనంకలిగింది. పోలీసులపై, ఈ సర్కారుపై పగ్గకసిపెరిగింది. ముసలవ్వలు. ముసలవ్వలు "అయ్యోపాపం! సచ్చిపోయిండు కొడుకు"అని వాళ్ళకసిని అక్కడికక్కడే ప్రదర్శించారు. నాటిక అయిపోయింది. యువకులనుండి నినాదాలు నలుదిక్కులనుండి మిన్నుముట్టాయి "గెరిల్లాపోరాటం వర్థిల్లాలి." "సాయుధ విప్లవం వర్థిల్లాలి" ఈ విధంగ ఒక అంశం ముగిసింది.

తర్వాత ఒక కిసాన్‌డాన్సు ప్రదర్శించాము .అందులో ఒక రైతుకూలి ప్రొద్దటి నుండి రాత్రివరకు ఏవిధంగ కష్టంచేస్తాడు. కష్టచేసినా రాత్రికి తినతిండి వుండదు. అసలు కట్టబట్ట సరిగ్గలేదు. ఉండనీకి ఇల్లు సరిగ్గలేదు. కారణంఏమిటి? కష్టాన్ని ఎవరు దోచుకుంటున్నారు? ఎలానిన్ను గానుగెద్దులా మార్చుకున్నారు? ఎన్నాళ్ళు ఇలావుంటావు? కాబట్టి నీవు తిరగబడి నీ కష్టార్జితం నీవు అందుకో- అందుకు సాయుధంగా పోరాడడమే సరైనమార్గమంటుచెప్తు ముగుస్తుంది డాన్సు.

తమ కష్టాన్ని గుర్తుచేస్తు ఎంతకష్టపడ్డా కనీసం కడుపునిండ తిండియివ్వని దొరలను, భూస్వాములను ఏమిచేయాలో, ఏలాచేయాలో చెప్తుంటే రైతుకూలీల

మొఖాలు వివిధ రకాలుగ మారాయి అనడంలో సందేహంలేదు- అంత వర్గకసితో వాళ్ళు నిండివున్నారు. సరైన మార్గదర్శకత్వంతో తప్పకుండ వాళ్ళు నవభారతనిర్మాణానికి ప్రాణాన్నిసైతం లెక్కచేయక ముందు నిలబడతారని చూసినవారికి స్పష్టమౌతది. డాన్సు ముగియగానే మళ్ళినినాదాలు "ప్రజాకళలు వర్ధిల్లాలి" "సుబ్బారావు పాణిగ్రాహి అమర్ హై" "విప్లవం వర్ధిల్లాలి" ఇలా రెండవ అంశం ముగిసింది.

తర్వాత పాటలుపాడాము ప్రజలభాషలో. ప్రజల రాగాలతో ప్రజల సామెతలను జతపర్చి, వారు పాడుకునేరీతిలో వారు వాడుకునే వాయిద్యాలతో పాడుతుంటే ప్రజలంతా అదోరకమైన 'ఆలోచన'లో పడ్డారు- విపరీతమైన వర్గకసిని రేకెత్తించే నేటి పోరాటాలకు బాసటగనిల్చిన పాటలను యువకులు మళ్ళి మళ్ళి పాడమని కోరారు. కొన్నిపాటలు మళ్ళీపాడాము. మళ్ళీయధాప్రకారం నినాదాలు ప్రజలనుండి వచ్చాయి.

అటుతర్వాత ఇంకో డాన్సుపెట్టాము. గ్రామాల్లో వర్గశత్రువులను ఖతంచేసి, పోలీసులనుండి, మిల్ట్రీనుండి తుపాకులులాక్కొని, ప్రజాసైన్యం నిర్మించుకొని ప్రజాసైన్యంతో దేశాన్ని విముక్తి చేయాలి. అందుకు నేడు శ్రీకాకుళం. నగ్జల్‌బరి. ధీర్భూం లాంటి సాయుధపోరాటాలు దేశం నలుమూలల సాగించనీకి రైతుకూలీలను, యువకులను, విద్యార్థులను సిద్ధంకండి అని ఉద్బోధించేది ఆ డాన్సు- డాన్సు అయిపోయింది మళ్ళీ నినాదాలు ఆకాశమంటాయి

చివరికి ఇంకొన్నిపాటలు పాడాము. వర్గకసితో ప్రస్తుతమున్న భూస్వామ్య ప్రభుత్వాన్ని కూలదోసి రైతుకూలిరాజ్యంకొరకు నిరంతరం పోరాడాలని ప్రబోధించే పాటలుపాడాము. సాంస్కృతిక ప్రదర్శన పైపాటలతో 'అయిపోయింది'-అని తెల్పగానే ప్రజలు అప్పుడుతేరుకొని లేచి నిలబడుతున్నారు. స్టేజీముందునుండి. స్టేజీపైనుండి విప్లవ నినాదాలు విపరీతంగ బాణాల్లావచ్చాయి. వేదిక పైనుండి మైకులో అమరవీరులకు జోహార్లు అర్పించారు. ముఖ్యంగ "చారుమజుందార్‌కు జోహార్లు" అనే నినాదం ఎక్కువగా వినబడింది

స్థానిక విద్యార్థుల, యువకుల చైతన్యం. వర్గకసి వాళ్ళరక్తంలో పొంగుతున్న ఆవేశంతో ఇస్తున్న నినాదాలువింటుంటే "ఈ ప్రపంచం మీది, మాదికూడ- అయితే అంతిమ పరిశీలనలోమాత్రం ఇదిమీదే- ఎందుకంటే ఉదయభానుని లేత కిరణాలలావున్న మీరు ఇంక చాలకాలం బ్రతికేవారుగనుక" అన్న 'మావోసూక్తి' తప్పకుండ జ్ఞాపకమొస్తది.

చివరికి జనంఅంతా వెళ్ళిపోయారు- కొంతమంది యువకులు, మేము అక్కడి ఆర్గనైజర్స్ కలసి మాకు ఏర్పాటుచేసిన భోజనస్థలానికి వెళ్ళేటప్పుడు రాత్రి 2-30 ని॥ లయింది. అసలు మాకు ఆకలిఅయినట్టు అనిపించనేలేదు. భోజనంచేసేటప్పుడు ప్రదర్శనగురించి ప్రజలు ఏమనుకున్నారు. అసలు ప్రదర్శన ఎలాసాగింది- జరిగిన పొరపాట్లు ఏమిటి? మొదలైన విషయాలుమాట్లాడుతూ భోజనం ముగించాం- అసలు ఆ ఆనందమేవేరు- మాటల్లోచెప్పరాని సమిష్టిప్రయోజనంగలది.

# పారిస్ కమ్యూన్: చారిత్రక పాఠాలు

కె. ప్రభాకరరెడ్డి

1871 మార్చి 18వ తేదీన పారిస్ నగరంలో కమ్యూన్ సంస్థాపన జరిగింది. ఈ మార్చి 18కి పారిస్ కమ్యూన్‌కు నూటనాలుగు ఏళ్లు నిండాయి. నాలుగు సంవత్సరాలక్రితం ఇదేరోజు కమ్యూన్ యొక్క శత జయంతి ఉత్సవాలు బ్రహ్మాండంగా జరిగాయి. ప్రపంచ కార్మికులంతా ఈ రోజు కమ్యూన్ పరిరక్షణకొరకు అపూర్వమైన త్యాగసాంప్రదాయాలను సృష్టించి, అసువులనర్పించిన ఫ్రెంచి కమ్యూనిస్టులకు శ్రద్ధాంజలి ఘటించి, కమ్యూన్ ఆరంభించిన ప్రపంచ సోషలిస్టువిప్లవాన్ని పరిపూర్తి చేయడానికి శపథం తీసుకొంటారు. పారిస్ నగరమంతా ఈ రోజు కోలాహలంగా ఉంటుంది లక్షలాది ప్రజలు పుష్పగుచ్ఛాలతో కమ్యూన్ స్థాపనకొరకు అసువులర్పించిన వేలాది కార్మికవీరుల స్మృతిచిహ్నంగా నిలిచిన కమ్యూనార్డుల గోడవద్దకుచేరి శ్రద్ధాంజలి ఘటిస్తారు. అమరవీరుల ఆశయాన్ని సాధించి తీరుతామని ప్రతిజ్ఞ చేస్తారు.

పారిస్‌లో కమ్యూన్ స్థాపన జరిగిననాడు సోషలిజం అనేది కేవలం ఒక భావన. ఈనాడది ఆచరణలోనున్న ఒక నూతన సామాజిక విధానం మానవుణ్ణి మరో మానవుడు దోచుకోడానికి వీలులేని ఎవరిశ్రమ ఫలితం వారికే దక్కే పరిస్థితి. ఒక్క సోషలిస్టు సమాజంలోనే సాధ్యమౌతుందని ప్రపంచమంతటా అత్యధిక ప్రజానీకం ఈనాడు గుర్తించింది. అంతేకాదు. అలాంటి సమాజాన్ని స్థాపించడానికి ఎడతెగని పోరాటాలు భూమి నలుచెరగులా జరుగుతూనే ఉన్నాయి. దోపిడికి తావులేని మరో ప్రపంచాన్ని సృష్టించడానికి అపూర్వ త్యాగదీక్షతో ప్రపంచ వ్యాప్తంగా కొనసాగుతున్న ప్రస్తుత సోషలిస్టు మహోద్యమానికి పారిస్ కమ్యూనే శంకుస్థాపనఅనే యధార్థాన్ని గమనించిన ప్రతి ఒక్కరూ ఈనాడు కమ్యూన్ వీరుల అపూర్వ సాహసాన్ని త్యాగాన్ని కీర్తించి తప్పక శ్రద్ధాంజలి ఘటిస్తారు ఉత్తేజంతో పొంగిపోయి. ప్రపంచ సోషలిస్టు విప్లవ పరిపూర్తికి తప్పక శపథం తీసుకొంటారు. మన భారత దేశంలోకూడ సోషలిజంఅంటే ఏమిటి? సోషలిస్టు సమాజాన్ని స్థాపించడానికి మార్గాలేమిటి? వగైరా విషయాలలో తూర్పు పడమరలకున్నంత విభేదాలున్నా పాలకవర్గ పార్టీలదగ్గర్నుండి చెప్పుకోదగ్గ ప్రతిపక్షాలన్నీ సామ్యవాదమే దేశాభ్యుదయానికి శరణ్యమని ఈనాడు చాటిచెబుతున్నాయి. సోషలిస్టు సమాజ స్థాపన లక్ష్యంగా చెప్పుకోని పార్టీలు మనదేశంలో యిప్పుడు చాలా అరుదు. పారిస్ కమ్యూన్‌కొరకు ఆనాడు ప్రాణాలు తృణప్రాయంగా ఎంచి పోరాడిన అమరవీరులు నాటిన బీజమే ఈనాడు ఇంతింతై బ్రహ్మాండమై భూమి నాలుగుచెరగులా వ్యాపించి అప్రతిహతమైన మహోద్యమంగా పరిణమించిందనీ వారాశించిన ప్రపంచ సోషలిస్టు విప్లవ పరిపూర్తి అతి చేరువలోనే ఉందని గ్రహించడానికి ఇంతకంటే గొప్ప తార్కాణం ఏమి కావాలి?

పారిస్ కమ్యూన్ కేవలం సామ్యవాద భావనకు ప్రాతిపదిక చేయడమే కాదు. దోపిడీ వర్గాల ప్రభుత్వాన్ని కూలదోసి పీడిత ప్రజల రాజ్యాన్ని పారిస్ నగరంలో 70 రోజులపాటు కొనసాగించి దోపిడీమూకల ప్రభుత్వాన్ని కూలదోయడంలోనూ, రాజ్యాధికారాన్ని స్వాధీనం చేసుకొన్న తర్వాత దాన్ని నిలబెట్టుకొనేందుకు అపూర్వసాహసంతో పోరాడడంలోనూ కూడ ప్రపంచం మొత్తంమీద మొట్టమొదటిసారిగా జరిగిన ప్రయత్నమే పారిస్ కమ్యూన్. అందువల్ల సోషలిస్టు సమాజస్థాపనకై అనేక దేశాలలో జరుగుతున్న విప్లవాలకూ ప్రపంచ సోషలిస్టు విప్లవంలో భాగంగా వలస దేశాల్లో ఈనాడు జరుగుతున్న ప్రజాస్వామిక విప్లవాలకూ పారిస్ కమ్యూన్ మార్గదర్శికాక ఆయా విప్లవాలను నిర్వహించే విప్లవకారులకు అదొక పెద్ద పాఠశాల: విప్లవ గుణ పాఠాలకది పెద్దగని. సోషలిస్టు సిద్ధాంత మహోపాధ్యాయులైన మార్క్సు, ఎంగిల్సులు పారిస్ విప్లవం జరిగిన తర్వాతనే అనుభవం తీసికొన్న పిమ్మటనే కార్మికవర్గ నియంతృత్వం స్థాపించకుండా సోషలిస్టు సమాజ నిర్మాణం అసాధ్యమని సిద్ధాంతీకరించారు. అలానే పాత రాజ్యాంగ యంత్రాన్ని తుత్తునియలు చేయకుండా దానిమీదనే ఆధారపడి వర్గరహిత సమాజాన్ని నిర్మించడం అసంభవమనికూడ చెప్పారు.

కమ్యూన్ అందించిన గుణపాఠాలను సృజనాత్మకంగా లెనిన్ నాయకత్వంకింద బోల్షివిక్ పార్టీ రష్యాలో అమలు జరిపింది కనుకనే మొదటి ప్రపంచ యుద్ధానంతరం అచ్చట విప్లవాన్ని జయప్రదంగా నిర్వహించి కార్మిక నియంతృత్వాన్ని స్థాపించగలిగింది. రెండవ ఇంటర్నేషనల్ నాయకత్వం కింద పారిస్ కమ్యూన్ పాఠాలు నిరాకరించబడ్డాయి కనుకనే విప్లవ పరిస్థితి ఎంతో అనుకూలంగా ఉన్నప్పటికీ చాలా దేశాలలో విప్లవాలు విఫలమైనాయి. అందువల్ల సోషలిస్టు సమాజ స్థాపన లక్ష్యంగా పురోగమిస్తున్న భారత విప్లవపక్షాలన్నీ కేవలం పారిస్ కమ్యూన్ యొక్క ఆశయాన్నుంచి ఉత్తేజం పొందడమేగాక దోపిడీవర్గాల నుండి రాజ్యాధికారాన్ని స్వాధీనంచేసుకొనడంలోకూడ దానినుండి పాఠాలు నేర్చుకోవాలి. చివరకు ఆ అధికారాన్ని నిలబెట్టుకోలేక విఫలత చెందడంలోకూడ కమ్యూన్ నుండి అమూల్యమైన గుణపాఠాలను తీసుకోవాలి.

### పారిస్ విప్లవానికి దారితీసిన పరిస్థితి

విప్లవ పరిస్థితిలేకుండా ఏ విప్లవము జరగదు. ఒకవేళ అందుకు ప్రయత్నం జరిగినా విఫలతచెందక తప్పదు. పారిస్ విప్లవానికి దారితీసిన పరిస్థితులేమిటి? ఫ్రాన్సు దేశం జర్మనీతో యుద్ధంలో మునిగిఉంది. అప్పుడు ప్రష్యన్ ఛాన్సలర్ బిస్మార్కు చేతిలో ఫ్రెంచిసేనలు దెబ్బపైదెబ్బ తింటున్నాయి. ఫ్రాన్సు ఓడిపోవటం ఖాయమనే భావం దేశమంతటా వ్యాపించిపోయింది. సైన్యంలోనూ, మధ్యతరగతి వారిలోనూ నిరాశ నిస్పృహలు వ్యాపించాయి. దానికితోడు ఆర్థిక పరిస్థితికూడా దెబ్బతింది. పరిశ్ర

మలు మూలపడ్డాయి నిరుద్యోగం మహమ్మారిలా ప్రబలిపోయింది. ఆర్థిక దుస్థితి మూలంగానూ, యుద్ధభారంతోనూ, నిరుద్యోగంవల్లను చిన్నచిన్న కుటుంబాలన్నీ విపరీతమైన బాధలకు గురైనాయి. వారి సహనానికి చరమదశ సంప్రాప్తించింది. ఆ రకంగా ఒక్క కార్మికవర్గంలోనేకాకుండా ఆనాటి ఫ్రెంచి సమాజంలో అత్యధికంగా వున్న చిన్న, మధ్యతరగతి (గ్రామ. పట్టణ) కుటుంబాలన్నింటిలోనూ అసహనం, అశాంతి పెచ్చరిల్లిపోయాయి. ఓరిమి నశించింది. ప్రభుత్వంపట్ల మితిమీరిన ద్వేషం పెరిగింది. ప్రభుత్వంయొక్క శక్తిసామర్థ్యాలమీద ఏ ఒక్కరికి విశ్వాసం లేకుండా పోయింది. కాస్తో, కూస్తో ఉదరపోషణకు ఇబ్బందిలేని మధ్యతరగతి (అప్పర్ మిడిల్ క్లాస్) వారిలోకూడా ఆ ప్రభుత్వం జర్మనీ దాడినుండి దేశాన్ని రక్షించగలదనే విశ్వాసంపోయింది. ఫ్రాన్సు జర్మనీకి బానిసకారాదనీ కోరేవారందరిలో మరోకొత్త ప్రభుత్వమేర్పడితేతప్ప లాభంలేదనే ధోరణి ప్రబలిపోయింది. ప్రభుత్వ సంస్థగాఉన్న నేషనల్ అసెంబ్లీ ప్రజలందరి క్రోధాగ్నికి గురిఅయింది. పచ్చి అభివృద్ధి విరోధకులైన భూస్వాములతోనూ, పెట్టుబడిదారులతోనూ అది నిండిఉంది నేషనల్ అసెంబ్లీలో ఉన్న ఈ అభివృద్ధి విరోధకులందరూకలసి ఏ క్షణంలోనైనా తిరిగి ఫ్రాన్సు రాజరికాన్ని స్థాపిస్తారేమోననే భయం ఆఖరికి బూర్జువా రిపబ్లికన్‌లనుకూడా పట్టిపీడిస్తోంది. ఈ విధంగా యుద్ధంమధ్యలో దెబ్బపైదెబ్బతింటూ ప్రతిష్ఠనుకోల్పోయి సైనికుల దృష్టిలోనూ ప్రజల దృష్టిలోనూకూడ చులకనై ఆర్థిక రాజకీయ సంక్షోభాలలో చిక్కుకొని సతమతమైపోతోంది. ఫ్రాన్సు ప్రభుత్వం, పై పరిస్థితులలో ఏదేశంలోనైనా విప్లవం చెలరేగక తప్పదు. అదే ఫ్రాన్సులో జరిగింది. ఆ విప్లవకర పరిస్థితులే ఫ్రాన్సుప్రజల్ని విప్లవపథంవైపు నెట్టాయి. పారిస్ పట్టణాన్ని స్వాధీనంచేసికొని కమ్యూన్‌ను స్థాపించడానికి దారితీశాయి. పెనుతుఫానులా విజృంభించిన ఫ్రెంచి ప్రజలధాటికి తట్టుకోలేని థియర్సు ప్రభుత్వం తన సైన్యాన్నీ, ప్రభుత్వోద్యోగుల్నీ తదితర దోపిడీమూకల్నీ వెంటదీసికొని పలాయనం చిత్తగించింది. భీకర సంగ్రామం జరిగిన తరువాత అమూల్యమైన కార్మికవీరుల రక్తంతో పారిస్‌నగర నడివీధులు అరుణారుణమైన పిమ్మటనే థియర్సు పలాయనమూ, పారిస్ పట్టణం విప్లవకారుల కైవసంకావడమూ జరిగాయి.

## కమ్యూన్ అపూర్వ సంఘటన

ప్రపంచంలో ఇంతకుముందెన్నో తిరుగుబాట్లు జరిగాయి. మానవ సమాజం ఒక మెట్టు తరువాత మరొక మెట్టుగా పరిణామం చెందుతూనె వచ్చింది. అలాంటప్పుడు చరిత్రలో పారిస్ కమ్యూన్‌కే ఇంతటి విశిష్టత ఏర్పడడానికిగాని, మానవ చరిత్ర మొత్తంలోనే ఇది అపూర్వ సంఘటనగా పేరొక్కనబడడానికిగాని కారణం ఏమిటి? చరిత్రలో ఎన్నో తిరుగుబాట్లు విప్లవాలు జరిగినమాట వాస్తవమే అయినా, మానవ

సమాజం ఒక మెట్టు తరువాత మరోమెట్టు అభివృద్ధి పథంపైపు పరిణామం చెందుతూ వచ్చినసంగతికూడా నిజమే అయినా ఆ తిరుగుబాట్లు లేదా విప్లవాల అనంతరం అధికారంలోకి వచ్చిన వర్గాలుకూడా దోపిడీవర్గాలే. సమాజం ఒక దశనుండి మరోదశకు పరిణామంచెందినా నూతనంగా ఏర్పడిన సమాజంలోకూడా కొత్తరకపు దోపిడివర్గాలే అధికారంలోకి వచ్చాయి. అంటే చరిత్రలో పారిస్ కమ్యూన్‌కు ముందు జరిగిన విప్లవాలన్నిటి పర్యవసానంగా ఒకరకపు దోపిడివర్గాలు కూలద్రోయబడి మరొకరకం దోపిడివర్గాలు అధికారాన్ని హస్తగతం చేసికొన్నాయి. చరిత్రలో మొట్టమొదటిసారిగా దోపిడిచేయబడేవర్గాలు అధికారాన్ని చేసికోవడం పారిస్ కమ్యూన్ స్థాపనలోనే జరిగింది. అందువల్ల నిజంగానే కమ్యూన్ ఒకఅపూర్వసంఘటన.

పారిస్ కమ్యూన్ యొక్క విశిష్టతను చాటిచెప్పే మరో అంశాన్నికూడ పరిగణనలోకి తీసికొని తీరాలి. ఇంతకుపూర్వపు విప్లవాలన్నిటిలోను పాలకవర్గాలు మారినా పాతరాజ్యాంగ యంత్రమే యథాతథంగా లేదా నామమాత్రమైన మార్పులు చేర్పులతో నూతన వర్గాలకు ఉపకరిస్తు వచ్చింది. రాజ్యాంగ యంత్రమంటే మార్క్సిస్టు నిర్వచనం ప్రకారం అధికారంలోఉన్నవర్గం ప్రత్యర్థి వర్గాలను అణచిపెట్టి ఉంచడానికి అవసరమైన యంత్రాంగం.

"...అందులో సాయుధ సైనికులుంటారు. అంతేకాదు గణసంస్థకు ఏ మాత్రము తెలియని జైళ్ళు, అన్నిరకాల నిర్బంధాలను అమలుజరపడానికి అవసరమైన వ్యవస్థలు, అనుబంధ సంస్థలు అన్నీ అందులో ఉంటాయి"—ఏంగిల్స్.

కాని కమ్యూన్‌లో అలా జరగలేదు కార్మికవర్గం చేతులలోకి అధికారం వచ్చిన మరుక్షణమే అంతకుపూర్వమున్న రాజ్యాంగ యంత్రాన్ని అంటే పాత ప్రభుత్వం తాలూకు సైన్యాన్ని, పోలీసు బలగాన్నీ సంపూర్తిగా రద్దుచేసివేశారు. మొత్తం ప్రజానీకానికి ఆయుధాలిచ్చారు. పాత రాజ్యాంగయంత్రం నాశనం చేయబడటం ఒక అంశం. ప్రజలందరినీ సాయుధంచేసి కమ్యూన్ రక్షణకొరకు యావత్తు ప్రజానీకంపైన ఆధారపడడం మరొక అంశం. ఇది చరిత్రలో అపూర్వమైన విషయం "నాగరికతాయుగం" ఆరంభమైన తర్వాత అంటే సమాజంలో వర్గాలేర్పడిన తరువాత, ఆత్మరక్షణకొరకు ప్రజలు తమంతటతామొక సాయుధశక్తిగా ఏర్పడి వుండడమనే ప్రశ్నకే తావులేకుండా పోయింది. దాని స్థానే పీడిత ప్రజల నణచి వుంచడానికి "ప్రత్యేకమైన సాయుధ సిబ్బంది" ప్రతి చోటా ఏర్పడింది.

తిరిగి చరిత్రలో మొట్టమొదటిసారిగా పాతరాజ్యాంగయంత్రం సమూలంగామట్టు పెట్టబడడమేగాక, దానిస్థానే స్వయంగా సాయుధులైన ప్రజలందరి నిర్మాణం ఏర్పడింది. దోపిడీ సమాజం సమూలంగా రద్దుచేయబడింది, కాబట్టి యావత్తు ప్రజానీకాన్ని

తమ్ము తాము రక్షించుకోవడానికి సాయుధుల్ని చేయగల అవకాశమూ, అవసరము ఏర్పడ్డాయి. పాత రాజ్యాంగ యంత్రాన్ని రద్దుచేయకపోయినా, అలానే స్వయం సాయుధులైన ప్రజానీకంపై ఆధారపడకపోయినా కమ్యూన్ అన్నిరోజులుకూడా మనగలిగి ఉండేదికాదు.

## కమ్యూన్ సాధించిందేమిటి ?

మార్చి 18న తిరుగుబాటు జరిగింది. అధికారం ప్రజలపరమైనది. ఆ విప్లవములో పాల్గొన్న ప్రజానీకమంతా నేషనల్‌గార్డుగా ఏర్పడింది. నేషనల్ గార్డు కేంద్ర కమిటీ అధికారాన్ని స్వీకరించింది. మార్చి 26వ ఎన్నికలు జరిగి పారిస్ కమ్యూన్ ఎన్నుకోబడింది. అప్పటి వరకూ ప్రభుత్వాధికారం వహిస్తూ వచ్చిన నేషనల్ గార్డు కేంద్ర కమిటీ రాజీనామా ఇచ్చి అధికారాన్ని కమ్యూన్‌కు దఖల్‌పరిచింది. అధికారాన్ని చేపట్టిన మరుక్షణమే కమ్యూన్ అపఖ్యాతిపాలైన పారిస్ పోలీసు బలగాన్ని రద్దుచేసింది ఆ తరువాత స్థాయీ సైన్యాన్ని (స్టాండింగ్ ఆర్మీ) రద్దుచేసింది. ప్రజానీకమంతటికి ఆయుధాలిచ్చి దానినే నేషనల్‌గార్డుగా ప్రకటించింది. తద్వారా మార్చి 30వ తేదీనాటికే పాత రాజ్యాంగయంత్రాన్ని సమూలంగా నాశనం చేసివేసింది.

సాంఘికంగా పీడిత ప్రజల నెదుర్కొన్న సమస్యలన్నిటిపైనా కమ్యూన్ తన దృష్టిని కేంద్రీకరించింది. మార్క్సు చెప్పినట్లుగా కమ్యూన్ చేసిన చట్టాలన్నీ ఆచరణ యోగ్యమైనవీ, తక్షణ సమస్యలకు పరిష్కరించేవి మాత్రమేగాని ఊహాపథంలో విహరించేవెంతమాత్రమూ కాదు. ఆక్రమిత స్థలాల్లో కట్టుకొన్న యిళ్ళపై పన్ను (1870 అక్టోబర్ నుండి 1871 ఏప్రియల్ వరకు) రద్దుచేసింది. అప్పటికే చెల్లించినమొత్తాల్ని భవిష్యత్తులో చెల్లించబోయే పద్దుల క్రింద జమ వేసింది. ఏ ప్రభుత్వోద్యోగికిగాని, నిపుణుడైన కార్మికునికిచ్చే జీతానికి మించి ఉండరాదని శాసనం చేసింది దాని ప్రకారం ఆనాటి ఫ్రాన్సులో నెలకు 500 ఫ్రాంకులకు మించి ఏ ఒక్కరికి జీతం ఉండడానికి వీలు లేదు. మత సంస్థలను ప్రభుత్వం నుండి వేరుచేస్తూ శాసనం చేసింది అప్పటివరకు మతాచార్యులకు ప్రభుత్వం జీతాలిచ్చింది. ఆ పద్ధతిని కమ్యూన్ పూర్తిగా రద్దుచేసింది. చర్చినంతటినీ జాతీయ ఆస్థిగా ప్రకటించింది. పాఠశాలలన్నింటిలో మత సంబంధమైన ఫోటోలు, ప్రార్థనలు తదితర చిహ్నాలేవీ ఉండరాదని నిషేధించింది అలానే అమలు జరిపిందికూడ. మూతబడిన ఫ్యాక్టరీల వివరాలు సేకరించి ఆ ఫ్యాక్టరీలో పనిచేస్తుండే కార్మికులందరిని కో-ఆపరేటివ్ సంఘాలుగా ఏర్పరచి వానిని నడిపే అధికారాన్ని ఆ సంఘాలకిచ్చింది. ఫ్యాక్టరీలవారిగా ఉండే అలాంటి కో-ఆపరేటివ్ సంఘాలన్నీ ఒక యూనియన్‌గా ఏర్పడాలనికూడ నిర్ణయించింది. బేకరీస్‌లో రాత్రిపూట పని చేసే పద్ధతిని నిషేధించింది. వస్తువులు తాకట్టుపెట్టుకొని అప్పులిచ్చే వ్యాపారాన్నంతటిని

నిషేధించింది. చట్టబద్ధమైన దోపిడిగా పరిణమించిన జరిమానాల పద్ధతిని రద్దుచేసింది. ఈ పనులన్నీ కేవలం ఒక మాసంలోనే, యుద్ధరంగంలో ఎడతెగని పోరు సాగిస్తూనే అమలు జరిపిందనే విషయం గుర్తుంచుకోవాలి.

కమ్యూన్ సంకుచితమైన జాతీయ సంస్థకాదు. కమ్యూన్‌లోకి ఇతర దేశాల కార్మికులుకూడ ఎన్నుకోబడ్డారు. అలా ఎన్నుకోబడ్డ వారందరినీ కమ్యూన్ ఆమోదించింది. కమ్యూన్ పతాకం ప్రపంచ రిపబ్లిక్ పతాకం కావడమే అందుకు కారణం. అలానే జాతీయ దురహంకారానికి కమ్యూన్ పూర్తి వ్యతిరేకం.

కమ్యూన్ బూర్జువా పార్లమెంటు వ్యవస్థలాంటి బాతాఖానీ క్లబ్బు కాదు. శాసన సభ మాత్రమే కాకుండా అమలు జరిపే పాలక వ్యవస్థకూడ అదే. ఈనాడు ప్రపంచ వ్యాపితంగా ప్రజాస్వామిక రాజ్యాలుగా చెల్లుబడిఅయ్యే రాజ్యాలన్నిటా పార్లమెంటు వేరు పాలనా యంత్రాంగం వేరు. వాటి రెండింటికి సంబంధంలేదు. అందుకే అలాంటి పార్లమెంటు సంస్థల్ని లెనిన్ కార్యాచరణతో సంబంధం లేని బాతాఖానీ షాపులన్నాడు. కమ్యూన్ వాటికి పూర్తి విరుద్ధం. శాసనాన్ని చేసేదీ అదే. అమలుజరిపేదీ అదే. నిజమైన ప్రజాస్వామిక సంస్థ అది.

అందుకే కమ్యూనును బూర్జువా ప్రపంచం సహించలేక పోయింది. ప్రజల చేతుల్లోకి ఆయుధాలు రావడం పెట్టుబడిదారీ ప్రపంచానికి ప్రాణాంతకంగా తోచింది. కార్మికునికీ, ప్రభుత్వ నిరుద్యోగికీ ఒకే జీతమంటే ఏ పెట్టుబడిదారీ దేశం హర్షించ గలుగుతుంది? పోలీసు బలగాన్ని రద్దుచేసిన మరుక్షణం దోపిడివర్గ ప్రభుత్వం మనుగడ సాగించగలదా? అందువల్లనే కమ్యూన్ ప్రవేశపెట్టిన నూతన వ్యవస్థ బూర్జువా వర్గాన్నంతా కలవర పరచింది. పారిస్‌పై ఎర్రజెండా ఎగరడాన్నది సహించలేక పోయింది.

## కమ్యూన్ వీరుల సాహసోపేత పోరాటం

కమ్యూన్ కార్యకలాపాలలో, ఆలోచనా విధానంలో సోషలిస్టుపథం ద్యోతక మయ్యేకొద్దీ విప్లవంలో పాల్గొన్న ఊగిసలాట శక్తులన్నీ క్రమంగా జారిపోనారంభించాయి. సోషలిస్టు సమాజ లక్ష్యం లేకుండా విభిన్న కోణాల నుండి కేవలం ధియర్సు, ప్రభుత్వంపై కోపంతోచేరిన మధ్యతరగతి మేధావులు, పెట్టి బూర్జువాజీ, బూర్జువా రిపబ్లికన్లు వగైరాలంతా క్రమంగా కమ్యూనుతో తెగతెంపులుచేసికొన్నారు. కమ్యూను ఓడిపోతుందనే వాతావరణం ప్రబలిపోయింది. అభివృద్ధినిరోధక వర్గాలన్నీ తమలో తమకున్న కీచులాటలన్నీ మర్చిపోయి కమ్యూనుకు వ్యతిరేకంగా ఒక కొయలిషన్‌గా ఏర్పడ్డారు. గ్రామసీమల్లో ఉండే రైతాంగాన్ని, చేతి వృత్తులవారినీకూడ కమ్యూనుకు వ్యతిరేకంగా సమీకరించగలిగారు, పెట్టుబడిదారీ విధానము యింకా అభివృద్ధికాని దేశా

లలో రైతాంగాన్ని సమీకరించకుండా, వారిని పెట్టుబడిదారీ రాజకీయాల నుండి వేరు పరచకుండా, ఇంకా స్పష్టంగా మార్క్సిస్టుల పరిభాషలో చెప్పాలంటే రైతాంగం పై కార్మికవర్గపు స్థిరమైన నాయకత్వం ఏర్పడకుండా కార్మికవర్గం పోషలిస్టు విప్లవాన్ని జయప్రదం చేయలేదనటానికి ఇంతకంటే ప్రబల తార్కాణం మరొకటి అవసరం లేదు.

పై బలహీనతలు బయటపడేకొద్దీ అభివృద్ధినిరోధకులంతా మూక వుమ్మడి దాడి ఆరంభించారు. ఆఖరికి ప్రష్యన్ చాన్సలర్ బిస్మార్కుగూడా కమ్యూన్ ప్రభావానికి హడలిపోయి థియర్స్ ప్రభుత్వంతో తనకున్న వైరాన్ని, తాను అప్పట చేస్తున్న యుద్ధాన్నికూడా మర్చిపోయి కెమ్యూన్‌ను అణచివేయడానికే అన్నింటికంటే మించిన ప్రాధాన్యత ఇచ్చాడు. కమ్యూన్‌ను ఓడించడానికి తన స్వాధీనంలో ఉన్న లక్ష మంది యుద్ధఖైదీలను (ఫ్రెంచి సైనికులను) వదలిపెట్టాడు. ఆ విధంగా జాతీయ, అంతర్జాతీయ అభివృద్ధి నిరోధక శక్తులన్నీ కలసి కమ్యూన్‌పై దాడిచేశాయి.

కమ్యూన్‌ను రక్షించడానికి చివరివరకు నిలబడింది కార్మికులే అనా తుదివరకు ప్రాణాలను లెక్కచేయకుండా పోరాడారు. స్త్రీలు, పిల్లలుకూడా అపూర్వ సాహసాన్ని ప్రదర్శించారు. కార్మికులకున్నవన్నీ నాటు ఆయుధాలే. ప్రభుత్వ సైనికులతోపోలిస్తే అవికూడా చాలా తక్కువ. చాలీచాలని ఆయుధాలతోను, నిరాయుధులుగా ఉన్న కార్మికులపై మారణాయుధాలతో ప్రభుత్వ కిరాయి సైనికమూకలు మారణహోమం కొనసాగిస్తుంటే కార్మిక స్త్రీలు చేతులు ముడుచుకొని కూర్చొనజాలరని ప్రపంచమంతటికీ చాటారు పారిస్ కార్మిక స్త్రీలు. చేతికందిన ఆయుధాలతో పోరాడి ఎంతోమంది వీరవనితలు నేలకొరిగారు. కమ్యూన్ పరిశీలకుడుగానున్న ఒక బూర్జువా రచయిత 1871 మేలో ఒక ఇంగ్లీషు పత్రికలో,

"ఫ్రెంచి జాతిఅంతా స్త్రీలతో కూడిఉంటే అదెంత భయంకరమైన జాతిగా పరిణమించేదో" అంటూ విస్తుపోయాడు.

అప్పటివరకు జర్మను సైన్యాలతో చిత్తుచిత్తుగా తన్నులుతింటూ పలాయనం చిత్తగిస్తూ వచ్చిన ఫ్రెంచి సేనాధిపతులంతా నిరాయుధులైన ఫ్రెంచి కార్మికవర్గంపై తమ పటాటోపాన్నంతా ప్రదర్శించారు. ఒక్క పారిస్ పట్టణంలోనే 30 వేల మందిని నిర్దాక్షిణ్యంగా కాల్చివేశారు. 45 వేల మందిని అరెస్టుచేశారు. అందులో చాలామందిని ఆ తర్వాత ఉరితీశారు. మరికొన్ని వేల మందిని ప్రవాసం పంపారు. పారిస్‌లో అన్ని వృత్తులలోను నిపుణులైన ఎంతోమంది కార్మికులతో కలిపి మొత్తం లక్షమందిని తన పొట్టన పెట్టుకుంది థియర్స్ ప్రభుత్వం. మొదట్లో కలిసివచ్చిన మిత్రులు మధ్యలో జారిపోవడం ఘోరంగా కసాయివాణ్ణినమ్మిన గొర్రెల్లా ఫ్రెంచి రైతాంగం అమాయకంగా దోపిడీమూకల మోసాలకుగురై కమ్యూన్‌కు వ్యతిరేకంగా నిలిచిన కారణంగా

నేమి, తమ మధ్యవున్న తీవ్ర వైరుధ్యాలన్నీ చంపుకొని ఫ్రాన్సు మొత్తంలోఉన్న అభివృద్ధినిరోధకులంతా ఒక కొయలిషన్‌గా ఏర్పడడంవల్ల అయితేనేమి చివరికా కొయలిషన్‌కు ప్రష్యన్ ఛాన్సలర్ బిస్మార్క్ సైతం కమ్యూన్‌పై పగబట్టి మద్దతునివ్వడం మూలంగానయితేనేమి ఎట్టకేలకు మే 28వ తేదీన కమ్యూన్ ఓడిపోయింది. కార్మిక రక్తంతో పునీతమైన ఎర్రజెండా పారిస్ నగరంపై తాత్కాలికంగా అవనతమైంది. తిరిగి అచ్చట రాబందుల రాజ్యం నెలకొనగలిగింది. ఇక చాలాకాలంవరకు సోషలిజంబెడద లేదంటూ చంకలు గుద్దుకున్నాడు థియర్సు. ఫ్రెంచి సేనాధిపతులంతా తామొక ఘన కార్యాన్ని సాధించినట్లు ఉబ్బితబ్బిబ్బులైనారు. ఫ్రెంచి బూర్జువా వర్గమంతా ఒక పెను గండం నుండి బయటపడ్డట్లు ఊపిరి పీల్చుకుంది. అయితే ఇది జరిగిన నాలుగునెలలకే బిస్మార్కుతో చావుదెబ్బలుతిని అతనికి పాదాక్రాంతమై ఫ్రెంచి జాతికే అప్రతిష్టాకరమైన సంధిచేసికొంది ఫ్రెంచి ప్రభుత్వం. పరాయి ప్రభుత్వానికి దేశాన్నమ్ముకోవడానికి కూడ సిద్ధమౌతారుగాని పెట్టుబడిదారులు, కార్మిక రాజ్యాన్ని ఆమోదించరని దీనిమూలంగా ఎవరికయినా తెల్సిపోతుంది.

## వైఫల్యానికి దారితీసిన కారణాలు

ప్రపంచంలో మొట్టమొదటి కార్మిక రాజ్యం 70 రోజుల తర్వాత కూలిపోయింది. కమ్యూన్ స్థాపననుండి ప్రపంచ శ్రామికజన సామాన్యం ఎలా పాఠాలు తీసికొంటుందో దాని ఓటమినుండిగూడా తప్పక పాఠాలు తీసికొంటుంది. కమ్యూన్ ఓటమికి దారితీసిన భౌతిక సిద్ధాంత ఆచరణలకు సంబంధించిన లోపాలను ఒక్కొక్కటిగా తీసికొందాం.

మొదటిది: ఉత్పత్తిశక్తులు అత్యున్నత స్థాయికి పెంపొంది అనుభవం కలిగిన చైతన్యవంతమైన కార్మికవర్గం ఏర్పడినప్పుడు సోషలిస్టు విప్లవ విజయం సులభతరమౌతుంది. ఆనాటి ఫ్రాన్సులో పై రెండు పరిస్థితులూ లేవు. అప్పటికి ఫ్రాన్సుదేశంలో పెట్టుబడీదారీ విధానం అంతగా అభివృద్ధి చెందలేదు. ఇంకా ప్రాథమిక దశలోనే ఉంది. ఆధునిక పరిశ్రమలు తగినంతగా పెంపొందలేదు. దేశం మొత్తంమీద సరుకుల అల్పోత్పత్తి విధానమే ఎక్కువ. ఉత్పాదక శక్తులలో ఆర్టిజాన్ (చేతివృత్తులవారు) రైతులు హెచ్చు. అందుకే లెనిన్ "వాస్తవానికి అప్పటికి ఫ్రాన్సు పెటీ బూర్జువా దేశం అని అన్నారు. అందువల్ల ఆనాటి ఫ్రాన్సులో కార్మికవర్గం సంఖ్యలో కూడా తక్కువ. అంతే కాక ఫ్రెంచి కార్మికవర్గానికి అప్పటికి తగినంత అనుభవంకూడా లేదు. దానికి తోడు మార్క్సిజానికి వ్యతిరేకమైన ప్రౌధనిజం, బ్లాంక్విజం సిద్ధాంతాల ప్రభావంకూడ తగినంతగా వారిపైఉంది. భౌతికంగాఉన్న పై పరిస్థితియొక్క ప్రభావం విప్లవ ఓటమిపై చాలవుంది.

ఉత్పత్తి శక్తులు అత్యున్నత స్థాయికి అభివృద్ధిచెందని దేశాలలో విప్లవం జరగదా? తప్పకుండా జరుగుతుంది. పై పెచ్చు జరగదనడం, లేదా జరిగినా నెగ్గదనడం మార్క్సిజానికి వ్యతిరేకం. చరిత్రకుకూడ అది వ్యతిరేకమే. అంతేకాదు పెట్టుబడిదారీ విధానం సామ్రాజ్యవాదంగా పరిణమించిన తర్వాత ప్రపంచ పెట్టుబడిదారీ విధానం అనే గొలుసులో బలహీనమైన లింకులవద్దనే విప్లవాలు బద్ధలవుతాయనేది సర్వాంగీకారమైన సూత్రమైందికూడా. అయితే ఈ సందర్భములో తీసికోవలసిన గుణపాఠాలు రెండు.

1. మార్క్సిజం మార్గదర్శకంగాగల సుశిక్షణగల కార్మికవర్గ పార్టీలేకుండా విప్లవం జయప్రదంకాదు. ఒకవేళ జయప్రదమైనా మనలేదు.

2 పెట్టుబడిదారీ విధానం అంతగా అభివృద్ధి చెందక ఇంకా పెటీబూర్జువా దేశంగా ఉన్న దేశంలో అత్యధికంగాఉండే రైతాంగంపై కార్మికవర్గం సుస్థిరమైన నాయకత్వం సంపాదించకుండానూ, వారిని బూర్జువా రాజకీయాల ప్రభావంనుండి వేరుపరచకుండానూ విప్లవం జయప్రదంకావడం కష్టసాధ్యం ఒకవేళ సాధ్యమైనా మనలేదు.

సరిగ్గా ఫ్రాన్సులో జరిగిందిదే. ఆనాటికి ఫ్రెంచి కార్మికవర్గానికి మార్క్సిస్టు సిద్ధాంత ప్రాతిపదికగాగల సుశిక్షిత పార్టీగానీ, బలమైన ట్రేడ్ యూనియన్‌గానీ లేవు. అంతేకాదు ప్రభుత్వంమీద తీవ్రమైన అసంతృప్తి ఉంది. కాని విప్లవం ఎందుకు చేయాలి? విప్లవ లక్ష్యమేమిటి? దాని కార్యక్రమమేమిటి? వగైరా విషయాలపై సుస్పష్టమైన అవగాహనలేదు. ఈ విప్లవంలో చివరివరకు నిలబడింది కార్మికులే, ఐతే అందులో ప్రధాన పాత్ర వహించినవారు చేతి వృత్తులవారు. వారిపై ప్రౌధనిజం, బ్లాంక్విజంల ప్రభావం చాలావుంది. ఇక రైతాంగంసంగతి, రైతాంగంపై కార్మికవర్గ ప్రభావమే శూన్యం. రైతాంగంలో ప్రభుత్వ వ్యతిరేకత హెచ్చుగానే ఉన్నప్పటికి వారిలోఉండే అపారమైన వ్యక్తిగత అస్తి ప్రభావాన్ని ఆసరాగాతీసికొని సోషలిజాన్ని గూర్చి లేనిపోని అబద్ధ ప్రచారంచేసి కొద్దిరోజులలోనే అభివృద్ధి నిరోధక వర్గాలన్నీ వారిని విప్లవ వ్యతిరేకులుగా మార్చగల్గారు. ఈ రెండు గుణపాఠాలనూ చాల సీరియస్‌గాతీసికున్నారు కనుకనే రష్యాలో లెనిన్‌నాయకత్వంక్రింద విప్లవం జయప్రదమైంది. అదే సమయములో ఈ గుణపాఠాలను సీరియసుగాతీసికొని విప్లవాలన్నీ ఓడిపోయాయి. రైతాంగాన్నిసమీకరించి వారిపై కార్మికవర్గపు నాయకత్వం సాధించడంపైనా కేంద్రీకృత ప్రజాస్వామ్యం ఆధారంగాగల ఉక్కుశిక్షణగల కార్మికపార్టీని నిర్మించడంపైనా రష్యాలో సోషల్ డెమోక్రాట్స్‌లోని మెన్షివిక్ శక్తులతో లెనిన్ చాలా తీవ్రమైన పోరాటం సాగించడంద్వారానే విప్లవ విజయాన్ని సాధించగలిగారనే విషయాన్ని మర్చిపోవీలుకాదు.

రెండవది: విప్లవం స్పాంటేనియస్‌గా జరిగింది. అందులో పాల్గొన్న వారందరి లక్ష్యం ఒకటికాదు. విభిన్నలక్ష్యాలతో వారందరూ విప్లవంలో చేరారు. కార్మికులతో పాటు పన్నులభారంతో కృంగిపోతున్న షాపుకీపర్ల దగ్గరనుండి జర్మనీతో ఓడిపోకుండా ఫ్రాన్సుదేశాన్ని సంరక్షించడానికైనా తప్పకుండా థియర్సు ప్రభుత్వం మారితీరాలని భావించే పెట్టీ బూర్జువా దేశభక్తులనుండి నేషనల్ అసెంబ్లీపై తీరని ద్వేషం కలిగి ఉన్న బూర్జువా రిపబ్లికన్‌లవరకు అందరూ విప్లవంలో పాల్గొన్నారు. అందువల్లనే అధికారం కార్మికవర్గ కైవసమై కమ్యూన్ ప్రజల్ని సాయుధులుగాచేసి ప్రభుత్వ సైన్యాన్ని రద్దుచేసిన దగ్గర్నుండి, కమ్యూన్ నిర్ణయాల్లో సోషలిస్టు ప్రభావం ద్యోతకమయ్యే కొద్ది కార్మికవర్గం మినహా మిగిలినవారంతా క్రమంగా జారుకొన్నారు. కాబట్టి విప్లవం జయప్రదం కావాలంటే ఆ విప్లవంయొక్క లక్ష్యంపైనా ఆ లక్ష్యాన్ని సాధించడానికవసరమైన కార్యక్రమంపైనా చైతన్యవంతమైన ప్రజాసమీకరణ జరగడం అత్యవసరం. అలా జరగనినాడు విప్లవం దెబ్బతినే అవకాశం తప్పకుండా ఉంటుంది.

మూడవది: దృఢనిశ్చయంతో కార్మికవర్గ నియంతృత్వాన్ని అమలుజరపలేకపోవడం మిగిలినవారంత జారిపోగా చివరికి నిలిచింది కార్మికవర్గమే. తద్వారా ఆచరణలో అనుకోకుండా కార్మిక నియంతృత్వమేఉన్నా ఆ నియంతృత్వాన్ని కమ్యూన్ స్థిరసంకల్పంతో అమలు జరపలేకపోయింది. సోషలిజం స్థాపించడానికి కార్మిక నియంతృత్వస్థాపన చాల అవసరమైన షరతు. ఏ దేశంలో పెట్టుబడిదారీ విధానం అంతగా అభివృద్ధిచెంది ఉండలేదో. ఏ దేశంలో ఇంకా సరుకుల అల్పోత్పత్తి విధానం ప్రబలంగా ఉంటుందో అలాంటిదేశాల్లో సోషలిస్టు సమాజం నిర్మించడాన్ని కార్మికవర్గ నియంతృత్వము సాపేక్షికంగా దీర్ఘకాలికంగానూ, స్థిరసంకల్పంతోకూడ అమలు జరపాల్సి ఉంటుందిఅని అనుభవం ఋజువుచేసింది. లేకుంటే కూలద్రోయబడిన,వర్గాలు పునస్సంఘటితమై సోషలిస్టు విప్లవాన్నే తుదిముట్టించగల ప్రమాదం తప్పక సంభవిస్తుంది. పారిస్ కమ్యూన్ అనుభవమూ అదేకాని స్పాంటేనియస్‌గా విజృంభించిన పారిస్ విప్లవంలో కార్మికవర్గ నియంతృత్వాన్నిగూర్చిన చైతన్యవంతమైన అవగాహన లేకపోవడం ఆశ్చర్యమేమీకాదు. అలా లేకపోయిన కారణంచేతనే అధికారంనుండి తొలగింపబడినవర్గం తిరిగి ఊపిరి పీల్చుకొని ఎదురుదాడి చేయడానికి అవకాశంలేకుండా మిలిటరీగాను, తదితర అవసర మార్గాల్లోనూ దానిని దెబ్బపైదెబ్బ కొట్టలేకపోయింది కమ్యూన్. లెనిన్ అన్నట్టు అంతర్యుద్ధంలో ప్రత్యక్ష మిలిటరీచర్యల ప్రాముఖ్యతను గుర్తించడంలో అది విఫలమైంది. పారిస్ నగరాన్ని స్వాధీనం చేసికొన్నవెంటనే వర్సైయిల్సుపై దాడిజరిపి థియర్సు ప్రభుత్వానికి ఊపిరితీసుకొనే అవకాశంలేకుండా చేయాల్సింది. దుర్మార్గులను తిరిగి తలఎత్తకుండా చావుదెబ్బ కొట్టలేకపోయింది. పెట్టు

బడిదారి సమాజం సృష్టించిన న్యాయసిద్ధాంత పరిధిలోనే "అత్యున్నత న్యాయాన్ని సంస్థాపించాలనే" ఊహాజనిత భ్రమలకులోనై ఆర్థికజీవనంలో ప్రాముఖ్యతగల బ్యాంకుల్నికూడ స్వాధీనంచేసికోలేదు. ఆ విధంగా కమ్యూన్ మిలిటరీగాను, ఆర్థికంగానూ శతృవర్గాన్ని నిర్దాక్షిణ్యంగా అణచివేయడానికి పూనుకోలేకపోయింది. అందుమూలంగా క్రమంగా అభివృద్ధి నిరోధక శక్తులన్నింటినీ కూడగట్టి కమ్యూన్‌పై ఎదురుదాడిచేసి దెబ్బతీయడానికి థియర్స్ ప్రభుత్వానికి అవకాశం చిక్కింది. ఒకవైపున ప్రభుత్వం ఆరంభించిన ఎదురుదాడిని తట్టుకోవడం రెండోవైపున కమ్యూన్ ఎన్నికలు విభిన్న సమస్యలపై శాసనాల తయారీ ఏ పనిపైనా కేంద్రీకరించలేక పోయింది. అందువల్ల మొదటినుండీ చివరివరకూ (మే 28 వరకూ) మిలిటరీగా కమ్యూన్ ఆత్మరక్షణలోనే ఉండిపోవాల్సివచ్చింది. ఆలాంటిస్థితి విప్లవానికి ఎప్పటికీ ప్రమాదమే. ఒకసారి విప్లవకారులు చేతిలోకి చొరవ వచ్చి ప్రభుత్వాన్ని కూలద్రోసే పరిస్థితి ఏర్పడిన తర్వాత తిరిగి శత్రువులు పునరాలోచించుకొనే అవకాశంకూడ ఇవ్వకుండా దెబ్బపై దెబ్బ కొట్టగలిగితేనే విప్లవం జయప్రదమౌతుంది. కాని కమ్యూన్ అలా చేయలేకపోయింది. పెట్టీబూర్జువా ఉదారతకు అడిగుసైంది. ప్రౌఢలిజం ప్రభావంకూడ అందుకు కారణం కావచ్చు. అందుచే పారిస్ కమ్యూన్ వైఫల్యాన్నుండి క్లుప్తంగా ఈ క్రింది నాలుగు గుణపాఠాలను తీసికొని ప్రపంచ కార్మికవర్గం ప్రపంచ సోషలిస్టు విప్లవాన్ని జయప్రదంగా ముగించడానికి పురోగమిస్తుంది.

1. విప్లవ విజయం కొరకు స్పష్టమైన లక్ష్యం కార్యక్రమాలతో శ్రేణుల్ని సన్నద్ధం చేయాలి.

. మార్క్సిజం సిద్ధాంతంగా గల విప్లవకర కార్మికవర్గపార్టీ లేకుండా విప్లవం జయప్రదంకాదు.

3. కార్మిక నియంతృత్వాన్ని స్థిర సంకల్పంతో అమలు జరపకుండా సోషలిస్టు సమాజ నిర్మాణం అసంభవం.

4. పెట్టుబడిదారీ విధానం అభివృద్ధి చెందని దేశాలలో కార్మికవర్గం రైతాంగంపై స్థిరమయిన నాయకత్వాన్ని ఏర్పరచుకొనకుండా విప్లవాన్ని జయప్రదం చేయజాలదు.

## కమ్యూను అజేయుల

పై లోపాల కారణంగా కమ్యూన్ విఫలత చెందినా ప్రపంచ సోషలిస్టు విప్లవానికి అది తొలిమెట్టు. కమ్యూన్ తాత్కాలికంగా ఓడిపోయినా అది అజేయం. దాని ఆశయం ఇంకా ప్రపంచ పీడిత ప్రజలందరి హృదయాలలో మారుమ్రోగుతూనే ఉంది. ఒకే ఒక పట్టణంలో లక్షమందిని పొట్టనబెట్టుకోవడం ద్వారా శాశ్వతంగా కమ్యూన్‌కు సమాధికట్టామని థియర్స్ ప్రభుత్వమూ, ఫ్రెంచి అభివృద్ధినిరోధకులూ ఉబ్బితబ్బిబై

పోయినా, ఇంతలో సోషలిజం ప్రమాదంలేదని వారు చంకలెగరేసినా కమ్యూన్ ఆశయం చావలేదు సరికదా అది నేల నాలుగుచెరగులా అనుదినం విస్తరిస్తోంది ఒకదాని తర్వాత ఒకటిగా పెట్టుబడిదారీ విధానపు కోటగోడలు బద్దలై పోతున్నాయి కార్మిక వర్గ విప్లవాన్ని కాలరాచి వేశానని థియర్సు ప్రభుత్వం బీరాలు పలికిన ఆరు నెలలు దాటకముందే పారిస్ నడిగడ్డపైననే తిరిగి కార్మికోద్యమం తల ఎత్తింది. సోషలిస్టు విప్లవం వర్ధిల్లాలి. పారిస్ కమ్యూన్ వర్ధిల్లాలి అంటూ పారిస్ వీధులన్నీ ప్రతిధ్వనించాయి. ఆ తరువాత కొద్ది సంవత్సరాలకే మార్క్సిస్టు సిద్ధాంత పునాదిపై ఫ్రాన్సులో కార్మికవర్గ పార్టీ అవతరించింది. ఫ్రాన్సు దేశమంతటా ఆ పార్టీ నాయకత్వం క్రింద పెద్దఎత్తున ఆందోళన జరిగింది. ఆ ఆందోళనతో ఫ్రెంచి ప్రభుత్వం కదిలిపోయి చివరకు కమ్యూన్ విప్లవకారులను విడుదలచేయక తప్పిందికాదు అంతేకాదు మరికొంత కాలానికి లెనిన్ అధ్వర్యం క్రింద పారిస్ కమ్యూన్ అందించిన గుణపాఠాలతో మూడవ ఇంటర్నేషనల్ ఏర్పడి ప్రపంచ సోషలిస్టు మహా విప్లవానికి సారధ్యం వహించింది. తద్వారా పారిస్ కమ్యూన్ రగిలించిన నిప్పురవ్వ క్రమక్రమంగా మహాజ్వాలగా ప్రపంచ వ్యాప్తంగా విస్తరించింది. ప్రపంచాన్నంతటినీ ఆవరించిన సోషలిస్టు విప్లవజ్వాలలో పెట్టుబడిదారీవిధానం నాశనంకాక తప్పదు. ఆ రోజుకూడ చేరువలోనే ఉందని నడుస్తున్న చరిత్ర చెబుతోంది. కమ్యూన్ ఆశయం అజేయం అప్రతిహతం. అనతికాలంలోనే ఆ ఆశయం సఫలీకృతమై తీరుతుంది.

వార్తలు :

ఫిబ్రవరి 16వ తేదీ ఉదయం 10 గం॥కు హన్మకొండ టౌన్‌హాల్‌లో వరంగల్ జిల్లా రాడికల్ స్టూడెంట్స్ యూనియన్ జిల్లా మహాసభ జరిగింది. జిల్లాలోని వివిధప్రాంతాల నుండి వచ్చిన 500 మంది పైగా ప్రతినిధులు ప్రకాశికా ముసాయిదాను వివరంగా చర్చించారు. వెంకటరమణి ఎ.పి.ఆర్.ఎస్ యు రాష్ట్ర కన్వీనర్ ప్రారంభోపన్యాసంచేశారు. సమావేశం సాంస్కృతిక కార్యక్రమంతో ముగిసింది. కార్యవర్గ సభ్యులుగా ఈ క్రిందివారిని ఎన్నుకున్నారు. అధ్యక్షుడు: ఎల్. జగన్ మోహన్‌రెడ్డి, ఉపాధ్యక్షుడు: సుబ్బారావు, కార్యదర్శి: సారయ్య, సహాయ కార్యదర్శులు: రామనర్సింహారెడ్డి మరియు రాజేశ్వరరావు, కోశాధికారి: భరత్‌కుమార్. ఇంకా 6 గురు కార్యవర్గసభ్యులు.

* * *

జనవరి 4వ తేదీన సికిందరాబాద్ జైల్లో జరిగిన లాఠీచార్జ్ విషయంలో న్యాయ విచారణ జరిపించాలని సికిందరాబాద్ కుట్రకేసులోవున్న వారందరినీ సికిందరాబాద్ జైల్లో ఒకే ఆవరణలో వుంచాలన్న న్యాయమైన కోర్కెలను అమలుచేయాలని రాష్ట్ర పౌరహక్కుల సంఘ కార్యదర్శి, రాష్ట్ర ప్రగతిశీల విద్యార్థి సంఘం, సత్యనారాయణరెడ్డి అడ్వొకేట్ (అధ్యక్షుడు తెలంగాణ ప్రజాసమితి) నలుగురు శాసనసభ్యులు శ్రీయుతులు బద్దం ఎల్లారెడ్డి, వై.వి. కృష్ణారావు, సింగరాజు రామకృష్ణయ్య, ఎ. శ్రీరాములు విజ్ఞప్తి చేశారు. ఆం.ప్ర. విప్లవ రచయితలసంఘం 5వ మహాసభ (అనంతపురం) ఈ డిమాం

డ్స్‌ను సమర్థిస్తూ తీర్మానం చేసింది. కామ్రేడ్స్ కె వి. రమణారెడ్డి, ఎం.టి. ఖాన్, చెరబండరాజు, రంగనాథం ఆందోళన సాగించారు. జనవరి 4వ తేదీన సికిందరాబాద్ జైల్లో జరిగిన లాఠీచార్జికి నిరసనగా విశాఖ జైల్లో కామ్రేడ్స్ కె.జి. సత్యమూర్తి, నాగ భూశాణం పట్నాయక్‌ల నాయకత్వంలోవున్న మా-లె పార్టి కార్యకర్తలందరూ నిరాహారదీక్ష చేశారు. కామ్రేడ్స్ ఎం. సుబ్బారెడ్డి, బి. మల్లయ్య, వీరభద్రయ్య, గుండు వెంకటయ్య, బద్ది యాదగిరిరాజు, వంగ గోపాలరెడ్డి, ఎస్. శివప్రసాద్ చాలారోజులు నిరాహారదీక్ష సాగించారు. సికింద్రాబాద్ జైల్లోవున్న మిగతా కామ్రేడ్స్ అంతా వారం రోజులు రిలే నిరాహారదీక్షలు చేశారు. కేసులో తమ డిఫెన్సుకోసం సంబంధించి పరస్పరం చర్చించుకొనే అవకాశంకోసం తామందరినీ ఒకేచోట వుంచాలన్నది సూత్రబద్ధమైన ప్రాథమిక హక్కుని పిటీషన్‌లద్వారాను, కోర్టులో ఉపన్యాసాలద్వారాను ఈ కామ్రేడ్స్ అధికార్లదృష్టికి, ప్రజలదృష్టికి కూడ తెచ్చారు. జైల్లో జరుగుతున్న అన్యాయాలను కూడ వీరు అవకాశమున్న మేరకు ప్రచారం చేస్తూనే వున్నారు. న్యాయమైన ఈ కామ్రేడ్స్ డిమాండ్స్‌ను సాధించడం ఇక ప్రజాసంఘాల చేతుల్లో వున్నది.

## విప్లవ రచయిత వరవరరావు, విద్యార్థి నారాయణరెడ్డికి బెయిల్ నిరాకరణ –

సికింద్రాబాద్ కుట్రకేసులో నిందితులైన కామ్రేడ్స్ వరవరరావు, కె. నారాయణ రెడ్డిగారలకు ఆంధ్రప్రదేశ్ తిరిగి బెయిల్ నిరాకరించింది. అంతేకాదు 6 నెలలలోపల విచారణ ప్రారంభం కాకపోతే అప్పుడుమాత్రమే తిరిగి బెయిల్‌కోసం దరఖాస్తు పెట్టుకోవచ్చునని కూడ తీర్పు చెప్పింది.

* * *

శ్రీకాకుళం జిల్లా సోంపేట తాలూక వోరాట ప్రాంతంలో 5 గ్రామాలలో రైతాంగం మూకుమ్మడిగా సాయుధంగా సంఘటితపడి '74 నవంబరు, డిశంబరు పంటల కోతల తరుణంలో సుమారు 50 ఎక॥ భూస్వాముల పంటను స్వాధీనంచేసుకున్నారు. ఇందులో 2.5 ఎకరాలు '74 ఆగస్టు, సెప్టెంబరు నెలలలో స్వాధీనం చేసుకొని పైరులు నాటారు.

ఈ స్వాధీన కార్యక్రమం రైతాంగం 10 దినములపాటు ఒక ఉద్యమంగా కొనసాగించారు. ఒక గ్రామానికి మరొక గ్రామం రైతులు పంటలు కోసుకోవడంలోనూ మార్చుకోవడంలోనూ సహకరించుకున్నారు. ఫలసాయాన్ని సమానంగా పంచుకున్నారు. సాంప్రదాయక ఆయుధాలతో రైతాంగమంతా వృద్ధులు, స్త్రీలు, పిల్లలతోసహా గొప్ప పట్టుదలతో పాల్గొన్నారు. పంటల స్వాధీనానికి ముందుగా కొన్ని దినములు తమలోతాము సంప్రదించుకొని పరస్పరం ప్రచారం చేసుకొని ఒక నిర్ణయానికివచ్చి కోతలకు దిగారు.

భూస్వాములు గుండాలను కొన్నిచోట్ల పంపించి రైతాంగాన్ని దెబ్బతీసే దానికి ప్రయత్నించారు. భూస్వాముల నిజస్వరూపాన్ని స్పష్టంగా అర్థంచేసుకున్న రైతాంగం ప్రతిఘటనకు సిద్ధపడుతూ, ఆయుధాలతో సంఘటితంగా రంగంపై కనిపించడంతో

గుండాలు సాహసించి ముందుకు రాలేకపోయారు. ఇటువంటి పద్ధతులవల్ల రైతాంగాన్ని లొంగదీసుకోవడం సాధ్యంకాదని గ్రహించిన భూస్వాములు పోలీసు స్టేషనులకు వెళ్ళి మొరపెట్టుకున్నారు. భూస్వామ్య వర్గ ప్రయోజనాలను కాపాడటంకోసం వున్న పోలీసులు ప్రజలపై దాడులుచేయటం ప్రారంభించారు. నిర్బంధాలకు గురిచేస్తున్నారు. ఇష్టంవచ్చినవారిని అరెస్టుచేయటం, కొంతమందిపై కేసులుపెట్టడం కొనసాగిస్తున్నారు.

"ఇవి మా భూములు. మేం స్వాధీనం చేసుకుంటున్నాం" అని రైతులు సమాధానం చెప్తున్నారు.

* * *

కలకత్తా నుండి వెలువడే "ఫ్రాంటియర్" "దర్పన్" పత్రికలమీద జరిగిన గుండాల దాడిని విరసం వరంగల్ యూనిట్ తీవ్రంగా ఖండిస్తున్నది.

* * *

కోలారు జిల్లా, సిడ్లఘట్ట తాలూకా, బసెట్టిపల్లె హోబళి కోనగిరిగ్రామంలో హరిజనులపై జరిగిన అత్యాచారాలను ఖండిస్తూ పాపతిమ్మనపల్లి నర్సప్ప, అతని భార్య మునెమ్మ కర్నాటక రాజ్య విమ్నజాతుల కమీషనరుకు, ముఖ్యమంత్రికి, ఐ.జీ.పీ.కి, డి.ఐ.జీ.కి ఇంకా తదితర అధికార్లకు తెలుపుతూ దురాచారాలను ఖండించ వలసిందిగా ప్రజలకు విజ్ఞప్తి చేశారు.

# విరసం కార్యదర్శి పత్రికా ప్రకటన

విరసం అయిదవ మహాసభలు జనవరి 13, 14 న అనంతపూరులో విజయవంతంగా జరిగాయి. జ్వాలాముఖి, నిఖిలేశ్వర్ మరికొందరు సభ్యులు సంస్థతో తమకుండే విభేదాలతో సభాకార్యక్రమాలను అడ్డచూశారు. కాని సాగలేదు. అందువల్ల వారిచ్చిన రాజీనామాను గుర్తించకుండా విరసం వారిని బహిష్కరించింది.

విరసం విప్లవ రాజకీయాలకు కట్టుబడివుండే సాంస్కృతిక సంస్థ. దానికి ఒక కచ్చితమైన ప్రణాళిక వుంది. ఆ ప్రణాళికను కర్నూలులో జరిగిన సర్వసభ్య సమావేశం ఏకగ్రీవంగా ఆమోదించింది.

జ్వాలాముఖి, నిఖిలేశ్వర్‌లు ఆరోపిస్తున్నట్టుగా విరసం ఏ ఒక్క గ్రూపు ఆధిపత్యంతో నడుస్తున్న సంస్థకాదు. జనతా ప్రజాతంత్ర విప్లవ సాధనకు సాయుధ పోరాటమే మార్గమని నమ్మేవారందరి ఉమ్మడివేదిక విరసం.

జ్వాలాముఖి, నిఖిలేశ్వర్‌లు ప్రతిపాదించిన ప్రత్యామ్నాయప్రణాళికను విరసం పూర్తిగా వ్యతిరేకిస్తుంది. ఎందుకంటే ఆ ప్రణాళిక సాయుధ పోరాటాన్ని, దీర్ఘకాలిక విమోచన పోరాటాలను గుర్తించటంలేదు. నక్సల్బరీ, శ్రీకాకుళం సాయుధవిమోచనపోరాటాల ఊపిరితో ఉత్తేజంతో పుట్టింది విరసం. అందువల్ల, చేవచచ్చిపోయిన ఈ ప్రణాళికను విరసం తిరస్కరిస్తోంది.

జ్వాలాముఖి, నిఖిలేశ్వర్‌లు తమ ప్రకటనలలోను, ప్రణాళికలోను శ్రీకాకుళ నక్సల్బరీ పోరాటాలనుగాని, సాయుధపోరాటంగాని ప్రస్తావించకపోవడం వారి రాజకీయ పతనానికి చిహ్నంగా విరసం భావిస్తోంది.

జ్వాలాముఖి, నిఖిలేశ్వర్‌లు బోధిస్తున్న "మార్క్సేతరులతో ఐక్య సంఘటన" విరసం తిరస్కరిస్తోంది. సాయుధ పోరాటాన్ని అంగీకరించని పాలకవర్గ ఏజెంట్లుతో మిలాఖతయ్యే సంస్కరణవాద రాజకీయాలను బహిర్గతంచేస్తూ విరసం వాటిని ప్రతిఘటిస్తుంది.

వ్యక్తులపైన, సంస్థపైన జ్వాలాముఖి, నిఖిలేశ్వర్‌లు చిమ్ముతున్న బురదని, దుష్ప్రచారాన్ని విరసం తీవ్రంగా గర్హిస్తోంది.

పాలకవర్గ రాజకీయాలతోబాటుగా దిగజారుడు రాజకీయాల సంస్కృతిని కూడా ప్రతిఘటించవలసిందిగా ప్రజలకి విరసం విజ్ఞప్తి చేస్తున్నది.

సం॥ కాశీపట్నం రామారావు
కార్యదర్శి.

1–2–75

SRJANA Telugu Monthly March '75 H/WL-10
Regd. No. with Registrar of News Papers 10953/67

# ఆంధ్ర ప్రదేశ్ రాడికల్ స్టూడెంట్స్ యూనియన్

విద్యార్థి ఉద్యమాలలో రాడికల్ స్టూడెంట్స్ యూనియన్ (R.S.U.) అవతరణ ఒక చరిత్రాత్మక సంఘటన. విద్యార్థు లెదుర్కొంటున్న సమస్య లన్నింటికి, సమాజంలో నానాటికీ తీవ్రమవుతున్న ఆర్థిక, సాంఘిక సంక్షోభాలన్నింటికి కూడా పరిష్కారం సాయుధ పోరాటంద్వారా జనతా ప్రజాతంత్ర విప్లవాన్ని జయప్రదం చేసినప్పుడే సిద్ధిస్తుంది- అనే ప్రాతిపదికమీద ఆర్.ఎస్.యు. ఏర్పడింది. కార్మికవర్గ నాయకత్వం కింద దేశంలో జరుగుతున్న రైతాంగ సాయుధ విప్లవంలో భాగంగా ఆ లక్ష్యానికి అనుగుణంగా ప్రజాపోరాటాలనిర్మిస్తుంది. మార్క్సిజం-లెనినిజం మావో ఆలోచనావిధానం దిక్సూచిగా రైతాంగ విప్లవాన్ని జయప్రదంచేయడానికి జనాన్ని సమీకరిస్తుంది. నక్సల్‌బరీలో అమరుడు కా॥ చారుమజుందార్ ప్రారంభించిన సాయుధపోరాటాన్ని తీవ్రతరం చేయడానికి కృషిచేస్తుంది. పై లక్ష్యాలమీద ఏర్పడ్డ ఆర్.ఎస్.యు. రాష్ట్ర ప్రథమ మహాసభలు ఫిబ్రవరి 22, 23 లలో పెద్దఎత్తున జరిగాయి. 22వ తేదీన మహాకవి శ్రీశ్రీ సభలను ప్రారంభించారు. రాష్ట్ర పౌరహక్కుల సంఘం కార్యదర్శి పత్తిపాటి వెంకటేశ్వర్లు ప్రసంగించారు- ఆదేరోజు సాయంత్రం 5000 మందితో పెద్ద ఊరేగింపు జరిగింది. నగర చరిత్రలోనే కనీవినీ ఎరుగని విధంగా మైలు పొడవున్న ఊరేగింపు నగరంలోని అన్ని ముఖ్య కేంద్రాలగుండా ఎనిమిది కిలోమీటర్లు మినీ లాంగ్‌మార్చ్ చేసింది. మార్క్స్, ఎంగిల్స్, లెనిన్, స్టాలిన్, మావో, చారుమజుందార్, వెంపటాపు సత్యం, పాణిగ్రాహి సుబ్బారావు, రాజారాంరెడ్డి, పంచాది నిర్మల మొదలైనవారి చిత్రపటాలతో విద్యార్థులు పాల్గొన్నారు. 'రైతాంగ సాయుధ విప్లవం వర్ధిల్లాలి' 'మార్క్సిజం-లెనినిజం మావో ఆలోచనావిధానం వర్ధిల్లాలి' నక్సల్‌భేరీ మోగించండి' 'సాయుధపోరాట ఎర్రజండా చిరకాలం వర్ధిల్లాలి' 'చారుమజుందార్ అమర్ హై' 'కా॥ జార్జిరెడ్డి అమర్ హై' మొదలగు నినాదాలతో నగరం అంతా ప్రతిధ్వనించింది.

23వ తేదీన బహిరంగసభలో మహాకవి శ్రీశ్రీ, పత్తిపాటి, చెరబండరాజు, వెంకటరమణి, సి. వి. సుబ్బారావు, రుక్మిణి ప్రసంగించారు. తరువాత జననాట్య మండలి వారి ప్రదర్శనలు ప్రేక్షకులను ఉర్రూతలూగించాయి.

**SRJANA**
Hanamkonda
Warangal - 506001

Rs. 1-50